శుభమస్తు—అవిఘ్నమస్తు.

శ్రీరామ భజనామృతపానమను

# పాదుకా పట్టాభిషేకము

[సీనరీల శ్రీహరిభజన నాటకము]

ఇది

మారేడుబాక వాస్తవ్యులగు

## పుట్టా రామదాసుగారిచే

రచియింపఁబడినది.



రాయవరము

శ్రీ మేరీ ముద్రాలయమున మల్లిడి సత్తిరెడ్డిగారిచే

ముద్రింపఁబడి గ్రంథకర్తచే ప్రకటింపఁబడినది.

1928

 [వెల రు 0—10—0 లు

# యిందు ధరించు పాత్రలు

## పురుషులు

భజనచేయు బాలురు

నటీ సూత్రధారులు

దశరథుడు—అయోధ్యాపురి రాజు

| | |
|---|---|
| శ్రీరాములు | దశరథుని కొమాళ్ళు |
| లక్ష్మణుడు | |
| భరతుడు | |
| శత్రుఘ్నుడు | |

వసిష్టుడు—గురువు

సుమంత్రుడు—మంత్రి

గుహుడు—శ్రీరామభక్తుడు

పడవలాగు కళాసులు

అయోధ్యాపురజనులు

పంచముడు—పాటించువాడు

నారదుడు—కలహకారకుడు

దేవేంద్రుడు—స్వర్గాధిపతి

బ్రహ్మదేవుడు

సురలు

## స్త్రీలు

సరస్వతి—బ్రహ్మభార్య

| | |
|---|---|
| కౌశల్య | దశరథుని భార్యలు |
| సుమిత్ర | |
| కైక | |

మందర—కైక చెలికత్తె

చతురిక—కౌశల్యదాసి

సీత—శ్రీరాముని భార్య

అయోధ్యాపురస్త్రీలు

# పీఠిక

శ్రీరామభక్తాగ్రేసరులారా! సుజనులారా! భజనచేయు బాలులారా! ఆ శ్రీరామమూర్తికి నాపయింగల కరుణారసముచేతను, పెద్దల ప్రేమాతిశయముచేతను, సజ్జన సాంగత్యముచేతను నాకీ యూహ కలిగెను. ఇందు శ్రీరామభక్తియే ముఖ్యమార్గంబనియు నిహపరముల సాధించుటకు రామనామముకంటె వేఱుసాధనము లేదనియు, శ్రీరాముండే పరమాత్ముండనియు నే నార్యులచే విని శ్రీరామనామము పఠించుచు మహాభక్తిచే మెలంగుచుంటిని. యిట్లుండగా అనేకవిధంబుల భక్తులందఱును భగవంతుని గుణము లెన్నుచుం బాడువారును నృత్యముచేయువారును కరతాళము లేయువారును శ్రీహరిభజనలలో నాటకంబుగా రామాయణంబును జూపువారును శ్రీకృష్ణలీలలం బాడువారునై యొప్పు భక్తతతివలన నీ ప్రపంచం బంతయును రామనామంబు పందిరపయి తీగలల్లుకున్న చందంబున నిండియుండెను. ఇందుకై యా భగవంతుని నే స్తుతించుటయే కాక మీ రెల్లరకును రామనామామృత యుతంబగు నీ కథను సులభశైలి గద్యపద్యాత్మకముగా నాకు శక్తిలేకున్నను భగవంతుని కరుణా కటాక్షముచే వ్రాయబూనితిని. మీ రెల్లరును నిందలి లోపములను మన్నించి ఒప్పులను గ్రహించి ప్రేమచేం బెంచెడు కీరమువలెను ముద్దుగాం బలికించెడు శుకంబువలెను ఆదరించిజూచెడు ముద్దుబాలునివలెను నా స్తోత్రమాలించి శ్రీరామమూర్తి చరితంబును పఠించి భజనలలో నుపయోగించి నన్ను కృతార్థుని జేయుటకై ప్రార్థించుచుంటిని.

ఆర్యులారా!

సీ॥ శ్రీకరంబైయొప్పు శ్రీరామకరుణచే బరగెడు మారేడుబాక గ్రామ
కాపురస్థుండరయఘనదండిపాల్గోత్రభవుండుపుట్టాన్వయవార్ధిచంద్రు
డమ్మన్నతత్సూనుండమితవిక్రమశాలి వేంకనయతనికి వేంకయాఖ్యు
డుద్భవముందె యశోభిరాముండతనికిందిరసదృశయా వేంకమాంబ

గీ॥ వలననుద్భవ మొందితి వారి కేఁబ్రథమతనూజుఁడ రామకథాపరుఁడను
రామనాఖ్యుండభక్తిమైవ్రాసినాఁడపాదుకాభిషేకంబునుభక్తులార! 1

సీ॥ శ్రీరాము నెప్పుడుచేరిగొల్చుటెకాని శాస్త్ర మొక్కటియైనఁజదువలేదు
కోరియారాముని గుణములెన్నుటగాని కావ్యమెట్టిదొ నెడ్డగాంచలేదు
లక్ష్మీశు నెడ్డ దలంచుచుండుటెకాని మహితలక్షణశాస్త్ర పఠనలేదు
కరుణజూచునటంచు హరిని వేడుటగాని గణయతిప్రాసలే గాంచలేదు
గీ॥ ఎన్న గురుకులవాసంబు జేయలేదు మనసునందున శ్రీరాముమఱువలేదు
శక్తుఁడను గాదు శ్రీరామ చరితమందు భక్తుఁడను తప్పులున్న
మన్నించమందు?॥ 2

ఉ॥ భక్తులుమీరు గూడి హరిఁ భావనసేయుచోట భక్తి సం
యుక్తములైనకీర్తనల నొప్పుగ గద్యము పద్యరాజి నా
శక్తికొలంది వ్రాసితిని జానకినాథ కథామృతంబు నా
సక్తిఁ బఠించి యెల్లఱును సంతసమొందగఁ గోరుచుంటిగా॥ 3

3 వ॥ భగవద్భక్తులార! యీ ప్రపంచమున సంసారంబను సాగరముదాటుటకు భక్తినిమించిన యుక్తిలేదని నా నమ్మకము. అందుచే శ్రీరాముని కరుణచే ముక్తులయ్యెదరని నా మనంబున నెంచి మిమ్మిట్లు ప్రార్థించుచుంటిని. సరోవరంబున నున్న తామరపుష్పంబు చుట్టుచు తిరుగుచున్న మండూకంబు తెలియంగున మూర్ఖతలోఁ బడక అట్టి పుష్పంబును యెక్కడనుండియో వచ్చిన తుమ్మెద గ్రహించి దానిలోని మకరందంబు నాఘ్రాణించిపోవును. అటువలెనే ఈ శ్రీరామచారిత్రంబు చదివి ఇందున్న సారాంశంబు గ్రహించి ముక్తులయ్యెదరని నా నమ్మకము. కావున యిందలి తప్పులను మన్నించి యొప్పులను గ్రహించి దీనిఁ బ్రచారమునకుఁ గొనిరా భగవద్భక్తులగు మిమ్ము గోరుచుంటి. ఇందలి లోపములున్న రెండవకూర్పున సవరించుకొనెదను.

ఇట్లు విన్నవించు భవద్విధేయుడు
పుట్టా రామన్న

శుభమస్తు—అవిఘ్నమస్తు

## —:శ్రీ గ ణే శ ప్రా ర్థ న:—



కం॥ శ్రీకరివదనుఁ ముందుగ చేకొని స్మరియించి కార్యసిద్ధికి మదిలో
నాకొన్న జీవిపగిదిని ప్రాకటమున నే నుతింతు భవ్యచరిత్రుఁ॥ 1

బెహాగ్ రాగము—ఏకతాళము--కీర్తన

శ్రీపార్వతీనందనా! మనవిచేకొని కాపాడుమా నీకన్న దైవాములూ
నాకు లేరని మ్రొక్కెదను॥ శ్రీ॥ ముందూగనీధ్యాన్నమూ పాసందూగ
జేసేదనూనా డెందాముఆనందమూయింపొందాగకృపజూడుమా॥ శ్రీ॥ 2॥
కోరీన తలపెల్లనూ నాకు కూరిమితోసేయుమా నారికేళాఫలములూ
నీకు నే తెచ్చియిచ్చేదనూ॥ శ్రీ॥ 3॥ మేటీదయివమునీవనీ నాకు ముక్తి
ఆధారామని సాటూరమాదాసునీ యీపాటీకి రక్షించుమా॥ శ్రీ॥ 4॥

## —:స ర స్వ తీ ప్రా ర్థ న:—

కం॥ అమ్మా! నినునామనమున సమ్మతితోఁదలఁచితమ్మ సరగుసరమ్మా!
ఇమ్మా! కోర్కులు వేగమెఅమ్మా! దయఁజూడనమ్మయబ్జజురాణీ! 2

2 బిళహరిరాగము—ఆదితాళము

నా.శి నావాక్యానను డవే బ్రహ్మరాణి కృపతోడ నన్ను జూడవే॥ నా॥
వీణావినోదరమ్యవాణి పద్మజురాణి శర్వాణి నిను నేను సన్నుతి జేసితిని॥ నా॥
తప్పులెంచబోకు తల్లి నాపై యెప్పుడూ నీకృపజల్లి తప్పక రక్షించు
తలపూన నన్నుంచు ఒప్పులు చెప్పు నను చెప్పేవ వీక్షించు॥ నా॥
ధరణిలో మారేడుపాక పురి దైవాము నెపుడూ విడువాక నిరతాము
నిను సమ్మి స్మరియించు శ్రీ పుట్ట రామదాసుని తలనాకిటుచు రక్షించు॥ నా॥

కం॥ శ్రీరామా! యనినామువిస్తారసదళనేత్రుండలంచి సౌఖ్యముగాంత్రున్
వేరే యికపనులేలను ధారాళముగాను మదిని సన్నుతిజేసున్॥ 3

మ॥ జనసంబైతివి మూకులంబున పయోసాంద్రాసమా దేవతల్
వినయం బేర్పడ సేవజేసెదను యీ విద్యాన్వృద్ధి నొందించుమా!
ఘనపతా పాకుల పేర్పువంచు మదిన్ గాపాడుమా యంటి నా
4

క॥ తలంచెదఁ బూర్వకవులను బిలచెద హరిభక్తవరుల బ్రేమదలిర్పన్
కొలచెద మద్గురుచరణము తెలిపెద శ్రీరామకథను తేటపడంగన్ ॥5

క॥ కని పెంచినట్టి జననికి వినయముగా జనకునకును వేడుకతోడన్
పనిబూని మ్రొక్కులిడెదను మనమున సంతోయము బాపిమన్నించుటకున్॥

3 అనుగు కీర్తన

శ్రీరామభజనా చేయండీ! పరమార్థామునకూ త్రోవ రండీ॥ రంగ॥
సారెసారెకు రామస్మరణా విడువాకండీ వేరే యోచించాక యిబివారు
మరకండి॥ శ్రీ॥ భక్తులందరు వేగరండీ సద్భక్తితో భజనే చేయండి॥ రంగ॥
శక్తికొలదిగ హరికి సేవాలు చేయండి ముక్తిదొ అనూనండి మోక్షా
మిదేరండి॥ శ్రీరా॥ సరుడాని యంచాబోకండి శ్రీమన్నారాయణా
మూర్తి సుండీ॥ రంగ॥ అసుహాలాబట్మార్ర అవతారించేనండీ—
దశరాధాపుత్రూలు దైనంబునమ్మండి॥ శ్రీరా॥ వాసిగా మారేడు
పాక పురవాసూడు రాముడునుగాక భాసూరముగ పుట్ట రామా
రానుని మెపుడు పోషించినట్టీ యా పుణ్యమూర్తినివలది॥ శ్రీరా॥

శుభమస్తు—అవిఘ్నమస్తు.

# పాదుకా పట్టాభిషేకము



## ప్రథమాంకము—ప్రథమరంగము



[భజనప్రవేశమున నటీసూత్రధారులు]

నటీ॥ సూత్ర:---(సభ కలయం గనుగొని సభాసదులకు నమస్కరించి)

సూత్ర:—సభాసదులారా!

సీ॥ సకలశాస్త్రంబులసారంబుగనుగొనఁజదువుచుండెడువిద్వాంసులార!
నిత్యంబుశ్రీరాము నెరనమ్మియుండియానీలవర్ణునిఁదలఁచుదాసులార!
తప్పులున్ననుమీరుదయయుంచిదిద్దుడీతనయులవలెజూచిధన్యులార!
పసిబాలులము మేము పలుకులనాలించి పాలించుడయ్యసద్భక్తులార!
బాల్యయవ్వన కౌమార వృద్ధులార బ్రహ్మ క్షత్రియ వయస్య కుల
శూద్రులార!
భక్తిరసపూరితంబనుకథను మీరువినియుసంతసమందుడీ వీనులార! 7

సీ॥ ఆగమగహనాట హరిఁబట్టి బాధింపఁ బ్రాజ్ఞతావిబుధకిరాతులార!
మాధవుగీతముల్ మధురతబాడెడు నతులగాయకపరభృతములార!
త్రిజగత్ప్రభుమహిమ తెలియంగవర్ణించి పలికెడు సత్కవిభట్టులార!
శ్రీవిష్ణుపాదాబ్జ చింతన మధుపాన కర్తలౌ భక్తభృంగమ్ములార!
గీ॥ శమదమదయాది గుణగణ చయముగలిగి
వరలు జనులార! వినుఁడు సద్భక్తితోడ
భుక్తిముక్తినొసఁగు పుణ్యపురుషు కథను
పాదుకాభిషేకంబు నా బరగుదాని॥ 8

సూత్ర:—చెలీ! ఇటురమ్ము.

నటి:—నాథా! ఏమిది? ఆహా! ఈచిత్రమేమి? నామనస్సున సంతోషంబు హెచ్చుచుండె. చూచుటకుచిత్రముగానుండె. ఈకారణ మేమి? కరతాళంబులచే బాలురు నృత్యముజేయుచుండిరి.

సూత్ర:—చెప్పెదనాకర్ణింపుము. ఈప్రపంచంబున శ్రీరామ చరితామృతంబనులతను శ్రీవాల్మీకిమహాఋషి నాపెను ఆమొక్కను అనేకకవులు వారివారి సామర్థ్యముకొలఁది పెంచి యాపుణ్యపురుషుని చారిత్రమును వచనముగాను పద్యములుగాను కీర్తనలుగాను హరి భజనలులో నుపయోగించి పందెరపైఁ దీవలల్లుచందంబున ప్రపంచం బంతయు శ్రీరామభక్తిచే ముంచివేసిరి. కావున యిట్టి శ్రీరామ చారిత్రంబున నయోధ్యాకాండంబులో శ్రీరామచంద్రుని శాంతం బును మాతాపితృవాక్యపరిపాలనంబును దశరథుని విచారంబును కైక పట్టుదలయును మంథర దుర్బోధయుఁ గౌసల్య దుఃఖంబును సుమిత్ర సుశీలను సీతాదేవి పాతివ్రత్యంబును భరతలక్ష్మణ రౌద్రా వేశమును అన్నయగు రామునిపై ననురాగమును శత్రుఘ్నుని బుద్ధి కుశలతయును గుహుని మూఢభక్తియును వెల్లడించి భక్తజనా మోదంబుగా భక్తిరసంబొల్కుచందంబున మారేడుబాక నివాసుం డును శ్రీపతిపదభక్తుండు నగు పుట్టా రామదాసునిచే రచియింపఁ బడిన పాదుకాపట్టాభిషేకం బను నాటకరాజంబును యీ హరిభజ నలో నుపయోగింపఁ బ్రయత్నించుచుండిరి. మనమును సహాయ్యు లమై యీకార్యమును నెరవేర్చెదమురమ్ము.

నటి:—నాథా! అతఁడంత గొప్పవాఁడా! ఏమి యెప్పుడును వినలేదు!

సూత్ర:—చెలీ! అతనిఁ జూచినవారెవ్వరును యిట్టివాఁడని దలఁపరు. అతని కెల్లప్పుడును భగవత్కథయందు సంతృప్తియేకాని—

గీ॥ జ్ఞానిసుంతయుఁగాఁడు అజ్ఞాని కాని శక్తియేమియుఁజూపఁడు భక్తి కాని
యుక్తులను యేమి యెఱుఁగఁడు ముక్తిత్రోవ కాని గాన రాముఁడు
బ్రోచెను కరుణబూని॥

నటి:—ప్రియా! శ్రీరామచారిత్రంబు విన్న ప్రయోజనం బేమి? వక్కాణింపుఁడు.

సూత్ర:—చెప్పెద నాకర్ణింపుము. రాముకథా ఫలితంబు నెన్నుటకు వేయినోళ్ల శేషునకయిన నలవికాదు. అయినను నాశక్తి కొలఁది తెలుపుటకుఁ బ్రయత్నింతు.

4 తోడిరాగము—ఏకతాళము

శ్రీరాముకథాచెప్పెదను ప్రేమతో మీకెల్లఁకును స్వామిమహిమ కాబోలును చెప్పఁగ నామనసాయెను॥ శ్రీ॥ రామసాంతకుని చరితము రుచిసుఘనము రసభరితము॥ శ్రీ॥ భక్తికిమూలంబు భవబంధలతకు లవిత్రంబు యిది పరమరహస్యంబు యిందుండె నవరసంబు॥ శ్రీ॥ ముక్తికిమార్గంబు యిది మోక్షసాధనంబు భక్తవరుల కమృతంబు పరమాత్ముని చరిత్రంబు॥ శ్రీ॥ అఘములెల్లఁబాయు ఆనంద మొందఁజేయు మన ఆపదలను తొలఁగఁద్రోయు ఆశపాశమెల్లఁగోయు॥ శ్రీ॥ శ్రద్ధతోడ వినుఁడీ బహు దొడ్డపుణ్యమండీ బద్ధకించకండీ సద్భక్తులార! సమయమండీ॥ శ్రీ॥ శ్రీరామదాసువాక్యము విన్నవారు ముఖ్యము భగవంతుని సామీప్యము చేరి పొందు సౌఖ్యము॥ శ్రీ॥

వ॥ చెలీ! ఇట్టిసుఖంబనుభవించేరు. కావున మనకు చాల తడవాయెను. దశరథుండు సభకువచ్చుచుండె పోవుదము రమ్ము.

(అని నిష్క్రమింతురు)

అయోధ్యాపురము కచేరీప్రవేశము దశరథుఁడు

వసిష్ఠుఁడు జనులు.

దశ:—సభాసదులారా! నేజెప్పఁబోవు వాక్యంబు వినుఁడు.

చ॥ అఱువదివేలయేండ్లు ధర హాయిగ రాజ్యముజేసినాఁడ నీ
భరమును మోయఁజాల ధర పాలనసేయ విరక్తిగల్గె నీ
ధరణికి జ్యేష్ఠపుత్రుఁడగు ధన్యుని రాముని రాజుజేసి నే
నరిగెద మౌనినై వనికి నిశ్చలశాంతి తపమాచరింపఁగన్॥ 10

వ॥ ఇది మీకెల్లఱకున్నూ సమ్మతమేనా? మీయభిప్రాయముఁ దెల్పుఁడు.

జనులు:—సాక్షాత్ భగవత్స్వరూపులగు శ్రీరామచంద్రుఁడు రాజ్యమును పరిపాలించుచుండ నెప్పుడు కన్నులపండువగాఁ జూతుమో యని వేచియుంటిమి. మాకందఱకును సంతోషము.

దశ:—గురువరా! ఏమిపలుకకుండిరి. లగ్నంబువిచారింపుఁడు.

వసి:—పరమాత్మునకు ముహూర్తంబేల. రేపే నిశ్చయము.

దశ:—శ్రీరామా! ఇటురమ్ము. నాపలుకులను శ్రద్ధతో నాలింపుము.

ఉ॥ పుత్రులరీతిఁ జూచికొని పోషణజేయుము పాలితాళి నీ
మిత్రులబోలు సౌఖ్యమును మేలుగజేయు మహాత్ముఁడైన సు
మంత్రుని గూడి రాజ్యమును మంచితనంబున నేలుమయ్య ప
విత్రముగాఁగ వంశమును వృద్ధినిజేయుము పుత్ర రాఘవా? 11

శ్రీరాము:—జనకా! మీయాజ్ఞ శిరసావహించెదను. మీయిష్టానుసారముగ వర్తించెదను.

దశ:—సుమంత్రా! రేపే శ్రీరామచంద్రుని పట్టాభిషేక మహోత్సవంబని యెల్లఱకుఁ దెలియఁజేయుము. మన అయోధ్యాపురంబంతయు నలంకరింపఁజేయుము. సూర్యోదయంబగుసరికి నెల్లరు సంసిద్ధముగా నుండవలెను. గురువరా! సభచాలింతము.

(నిష్క్రమింతురు)

జను:—ఆహా! రేపేనట పట్టాభిషేకము! కనులపండువుగాఁ జూచెదము. (నిష్క్రమింతురు)

ద్వితీయరంగము—రాజవీధి

[ప్రవేశః పంచముఁడు]

పంచ:—(తప్పెటవాయించుచు) రేపు సూర్యోదయం బగు సరికి జనులాదలును శ్రీరామపట్టాభిషేకమహోత్సవమును చూచుటకు రావలెనో హెూ! (తప్పెటవాయించుచు నిష్క్రమించును)

రెండవవీధి

[నారదమౌని ప్రవేశము]

నార:—ఆహా! ఏమి! ఈపురంబెల్ల అలంకరింపుచుండిరి! కారణమేమైయుండును. (పంచముఁడు తారసించును) నారముఁడు యెవఁడవురానీవు!

పంచ:—బాబూ! మాది పెద్దకులమండి.

నార:—ఎక్కడ కేగుచుంటివి?

పంచ:—రేపుండి పదిఘంటలవేసరికి దశరథమహారాజుగారు పెద్దకొడుకురాజౌనట.ఊరెల్ల నుచాటిస్తున్నాను. (అని నిష్క్రమించును)

నార:—ఆహా! ఏమి! శ్రీమన్నారాయణుఁడు నరజన్మ మెత్తిన రాక్షసబాధ తొలఁగు ననుకొంటిని. శ్రీరామపట్టాభిషేకమే నిశ్చయమయినచో రాజ్యకాంక్షలోబడి మనుష్యులను మఱచిపోవును. ఈ క్రూరదానవులఁ జంపుట కల్ల. కావున నేనిప్పుడేతంత్రమూహించి యదిమాన్పఁ బ్రయత్నించి త్వరితముగా నమరావతి కేగెద.

(నిష్క్రమించును)

తృతీయరంగము—ఇంద్రసభ

[ప్రవేశము నారదముని]

(దేవేంద్రుఁడు యెదురుగబోయి మునివరా! ఈఆసనమలంకరింపుఁడు)

నార:—ఇంద్రా! నా కేమియుఁ దోచుటలేదు.

దేవేం:—మునివరా! ఆత్రాందవేమి! ఆశ్చర్యముగా బలుకుచుంటివేల?

5 జైలాంగ్—నాదనామక్రియరాగము—ఆదితాళము

మానినులాచంద్ర! మఱి వినుము! సుగుణసాంద్రా! నారద!॥ మాని॥

పనిబూనియిటు వచ్చిన కార్యము వినగోరెద నతివేగమె దెల్పుము
మనమున సంశయమెల్లను మానుము ఘనముగ జేసెద నే నా కార్యము ॥మా॥

నారద:—వినుము సురానాథా! మన కెటులదప్పునీ రాక్షసబాధ ॥విను॥
ధనువునందు భ్రమజెంది దశరథాతనయుండేలబూనె నయోధ్యా! ॥వి॥

దేవేం:—హరి నరుండై యుప్పుట్టి అసురులజంప ప్రతినబట్టి అరమర జేసెను
గనుకను నట్టి ఆశ లేల యింకను సంతృప్తి కలుగలేదు యికనేమి
చేయుదును పరమమునీ! యాలోచన దెల్పుము॥ మాని॥

నార:—సురలందఱు గలిసి త్వరగా నమరావతి విడచి విరాజిని
యా సత్యలోకమున మొఱలిడుచును నిలచి ఆవిరించి గుఱించి
స్మరించ మిము రక్షించి దయతలంచు॥ విను॥

దేవేం:—వేగబోదుమయ్యా యికనూ జాగుచేయమయ్యా భోగము
లేలను యిక నా బ్రహ్మను సాగిలి మ్రొక్కెదము॥ మాని॥

నార:—విఘ్నము జేయగనూ రాముని వనమును జేర్చగను దగ్ధము
చేయును యారాక్షసులను దశరథపుత్రుండు॥ విను॥

వ॥ కావున ఈకార్యమును తప్పక చేయుడు. ఆలసించకుడు. నేబోవుచుంటిని.

(నిష్క్రమించును)

దేవేం:—సురలారా! సత్యలోకమునకు త్వరగాబోవుదము రండి.

(నిష్క్రమింతురు)

## చతుర్థరంగము—సత్యలోకము

[ప్రవేశము బ్రహ్మ, సరస్వతి ముకిళితహస్తులయి దేవతలు]

6 యమునాకల్యాణిరాగము—ఏకతాళము

దేవదేవ! కావుమా! దీనరక్షబ్రోవురా! ఆపదలను బొందలేము ఆ త్రివిధము అతిత్వరితము రిపులనుచంపా మముకృపవీక్షింపా శ్రీపతియే నరరూపా మవతరించి భంగపుచ్చె॥ దేవ॥ దిక్కునీవెగా మా మ్రొక్కులువినగా చక్కనవును నిక్కముగ సతినిబంపు మదిచెలువగ॥దే॥ ఆర్తులమేముా! మా స్తోత్రమువినుముా! ధాత్రిలోన రామదాసకవి పాలా! జాలమేల! ॥ దేవ॥

బ్రహ్మ:—సురలారా! తాళుడీ! ఇప్పుడే మీకోర్కె చెల్లించెద. భయమువిడువుడు. (సరస్వతివైపుజూచి) మనోహరీ! వింటివిగదా! ఈకార్యము నీవలన కావలెను. నీచతురతజూపి శ్రీరాముని అరణ్యమునకు చేర్చుము. మంధర కైకచెలికత్తె. దానివమాయలలో గైకాదేవి మునిఁగియుండెను. కావున నీవా కైక వాక్కుయందు ప్రవేశించి భరతునకు రాజ్యమును రామునకు వనవాసమును కోరునట్లు చేయుము.

సర:—సురలార! నానాథునియాజ్ఞానుసారముగ మీకోర్కె చెల్లించెద.

7 సుద్ధతోడిరాగము—ఏకతాళము

సర:—భయమును కావుముతల్లీ! దయశాలీ! అయోధ్యకు నీ వెళ్లి॥ ఆఆఆఆ ఐ॥ కల్పకవల్లీ! కావుముతల్లీ! శ్రితపాల్వల్లీ! శీఘ్రము మాయనుజల్లి॥ ఆ।ఆఆఆ। భయ॥ కావుమమ్మదయతోటీ మావంటి దీనులకును దిక్కంటీ॥ ఆ॥ వేల్పులమేటీ యెవరునీసాటీ పల్కులబోటీ పాలించుము దయతోటీ॥ ఆ॥ ప॥ భయ॥ విద్యల నొసంగెడు రాణీ నీలవేణీ వాక్కులనుండెడు వాణీ॥ ఆ॥ భ॥

జగనిర్మాణీ విధి ప్రియరాణీ విఘ్నముబాని యేగుమమ్మ యజురా.కి॥ ఆ॥ మె॥ భయ॥ దిక్కనినమ్మితిమమ్మా!యజుకొమ్మా! దాసుల బ్రోవగదమ్మా! వేగము జనుమా! జాగుచేయుదు! సాగిలి మ్రొక్కెదము?

సర:—సురలార! మీమీనివాసములకు చనుడు. నేనిప్పుడే త్వరగావెళ్లి మీబాధలు తప్పు మార్గమూహించెద.

సురలు:—మహాత్మా! మాకుసెలవు. అమ్మా! మాపై దయ యుంచుము. (నిష్క్రమింతురు)

పంచమరంగము—అయోధ్యాపురి రాజవీధి

[ప్రవేశము మంధర]

మం:—(యిటునటుజూచి) ఆహా! ఏమి! ఈ సౌందర్యము!! ఎప్పుడు నిట్టివింత చూడలేదె!! కన్నులపండుగవలెనె కాన్పించుచుం డెను. కారణమేమైయుండును? ఈచిత్రములువర్ణించుటకు నాతరమా!

8 ఇంమస్తానీ తోడీరాగము—ఏకతాళము

ఏమో యీవింత! బలు అందమాయె పురమంత! ఇది గ్లాసులైట్ల కాంతా! కాకుం - నాకల భ్రాంతా!॥ఏమో॥ హెచ్చయిన పందిరీలు! పచ్చాని తోరణాలు! ఈ వచ్చూ వెళ్లుజనులు నూరెల్లను మేళాలు! బలే!॥ ఏ॥ 2॥ పందిరికి చాదినీలు పెంపొంద నల్లె లతలు! అందూన చిత్రపటములు ఆనందమొందుచుండె ప్రజలు॥ ఏమో॥ 3॥ అందమైన ముగ్గులు పసందు వెల్లగోడలు ఇక సందులేదు వీధులు గోవిందయనెడు హరిభజనలు॥ ఏమో॥ 4॥ అల్లవారిదటికి వెళ్లి నార్తనడిగి పోయెదను కైకదరికి యిక ప్రొద్దుపోయెనీసరికి॥ ఏమో॥ 5॥ రామదాసు నేలు వాడు శ్రీరాము పెండ్లినాడు సామాన్యముయ్యోగా నపుడు ఏమొవేడు కొందె నిపుడు॥ ఏమో॥ 6॥

[ప్రవేశము కౌసల్య దాసియగు చతురిక]

చతు:—ఆహా! నేడుగదా! మాకందఱకు సంతోషకార్యము! తెల్లవాఱిన శ్రీరామచంద్రుని పట్టాభిషేకమహోత్సవము! కావున పనులెల్లను వెంబడినే జక్కఁజేసికొనెదను. కనులపండువగ నా వేడుక చూచెదను. (కొందఱుగా నడచుచు) ఏమే! మంథరా! ఇట్లు ఆశ్చర్యంబుగా జూచుచుంటివి. శ్రీరాముని పట్టాభిషేకమహోత్సవ మని నీవు తెలియలేదా! ఏమి నీవింత తీఱికగానుంటివి?

(అని నిష్క్రమించును)

మంధ:—ఏమీ! కౌసల్య కొమారునికా యేమి! రాము నికేనా!! చతికిలబడి అబ్బబ్బా! ఈ మాట విన్నతోడనే నా మనసు విఱిగిపట్టుచున్నది. నాడు బంతితో కొట్టినదెబ్బ యిప్పటివఱకు బాధించు చుండెను. నేనీ కార్యంబు జరుగనిచ్చెదనా! నా పట్టినప్రతిన తప్పక నెఱవేర్చెదను. నాకు శత్రుండయిన రాముండు రాజ్యం బేలుచుండ నేఁ జూచి యెట్లోర్వగలను నా చతురత నంతయు వినియోగించెద. హా శ్రీరామచంద్రా! చల్లగా రాజ్యమేలుచూ సంతోషముతో నుండెద ననుకొంటివా? నా వీనులను శూలములనైనాటెను యెట్లైన మాన్పెదను. నీ పట్టాభిషేకంబు జరుగనిచ్చెదనా!

9 కీర్తన ఫిల్హారాగము—ఏకతాళము

ఎంతమాటవింటి ఆ సీతాపతి బల్కొంటి॥ యెం। ననువిగరగొట్టు తుంటి యిప్పటివఱకు కుంటుచుంటి॥ నే నెంత॥ 2 పట్టముగట్టనిత్తున యిష్టముతోడ జూస్తునా యెట్లయినను యిదిమాన్పనా సంతుష్టి కైక కునుగూర్పనా॥ యెం॥ 3 యుక్తిపన్నెదాను నా శక్తికొలదిగాను బల్ సాయుక్తముగాను శ్రీరామునడవి జేర్పగను॥ యెం॥ 4 పోయెదను నేను తొందరబోధింతు కైకకుముందఱ కాకున్న పేరుమంధర కౌసల్య ముద్దుసుందరా॥ యెం॥ 5 నే పట్టినట్టిపట్టు చెల్లించకుండునట్టు యిక

తెలిసె నీమగట్లు నే ధ్యానించెద చేష్టలు॥ యెం॥ 6 రామదాసునేలి నట్టి శ్రీరాము సన్నుకొట్టి యీ రాజ్యము సముకట్టి నీవేలెదవా సంతుష్టి॥ యెం॥

వ॥ ఆహా! నా బోధ కైక వినునో వినదో (ఆలోచించి) హా! వినుటయేకాదు నాపైఁగల ప్రేమాతిశయంబుచే విషముపెట్టి నను దినును. సంశయింపనేల! నాచేతనున్న కీలుబొమ్మకదా! నేనెట్లు త్రిప్పిన నట్లు యాడును. ఇప్పుడే త్వరితముగఁ బోయి—

గీ॥ కొండెములుచెప్పి కాపురము గూలుపేతు
నిందవేసి కెట్లను నే సహింతు
దండకాటవి రాముని బంపజేతు
దండిరాజ్యంబు భరతుని దగఁజేతు॥

యీ పట్టాభిషేకమే చెల్లుపడకపోయితినా నాపేరు మందర కాదు! (నిష్క్రమించును)

[ప్రవేశము సరస్వతి]

ఆహా! నాకు మంచి సమయంబు ప్రాప్తించినది. మంథర నాచే లోఁబడియుండెను. నే నిప్పుడే కైకవాక్కునందుం బ్రవేశించెద. మందర కేయు బోధవలన నామె పట్టాభిషేక విఘ్నకారకురాలిఁ గావించి వరములను కోరించి శ్రీరాము నరణ్యమునకు పంపెద వీర లందఱిని నా మాయలో మునుంగఁజేసెద. సురల మెప్పించెద నా నాథు నాజ్ఞ శిరసావహించెద స్వాతిశయముగా బోయెద.

(నిష్క్రమించును)



శుభమస్తు—అవిఘ్నమస్తు.

# పాదుకాపట్టాభిషేకము



## ద్వితీయాంకము—ప్రథమరంగము



### కైక అంతఃపురము

హంసతూలికా శయ్యపయి నిద్రించు చుండును. ప్రవేశము మంథర మేనెల్ల చెమటచే వగర్చుచు పఱుగెత్తివచ్చి అమ్మా! కైకమ్మా! లెమ్ము లెమ్ము! కైకా! కైకా! యీ మొద్దునిద్దురయేల దరిద్రదేవత తలపయి కెక్కెను లేగవమ్మా!

కైక:—(కనులు నులుముకొనుచు) అబ్బబ్బ యేమీ మందరా! యీ అర్ధరాత్రంబున నా నిద్రాంతయుఁ జెఱచితివి యెప్పుడును యేదియో యొక మిషపెట్టి నన్ను సకలశ్రమల పెట్టెదవుగదా త్వరలో చెప్పుము ఆ కార్యమేమి. నిద్రాభంగముచే నా కనులు మండు చుండెను.

### డైలాగ్ ఫీల్వారాగము—ఏకతాళము

మంథ:—లెమ్ము లెమ్ము కైకా! యీనిద్రయేల నీకింక॥ లె॥
అమ్మా! చూడు! పురమువంక అలసించ నేలనింక॥ లె॥ 2
కైక:—మందర నన్నింత తొందఱగా లేపనేల?
మంథ:—సుందరగాఁ జెల్వు బాల సుందరి సుకజాలమేల॥ లె॥
కైక:—వింతదోచుచుండె వీధి యెంతో చిత్రముగనుండె॥ విం॥
మంథ:—ఇసుకవేసిన రాలకుండె వీధులెల్ల జనులు చెనిండె
కౌసల్యకు నోముపండె కారణంబు తెలియకుండె॥ లె॥

కైక:—కపటంబిడిచాల కాకుంటె కంగారేల॥ క॥
హాస్యమాడవచ్చితివా? అతివ నిద్రలేపితివా!
అంతమాయలాడివా ని యంతు తెలియదనుకొంటివా॥
మంధ:—కోపమేలనమ్మ నను కొట్టరాదు కైకమ్మా॥ కో॥
శ్రీరామచంద్రుడంట సింహాసనమెక్కునంట
జనులకెంతొ వేడుకంట జ్యేష్ఠసుతుండు రాజంట॥ లె॥
కైక:—వింత చెప్పితివె ఆ వేడుక చూతమురావె॥ విం॥
సంతసంబు గూర్చితివె సఖియ కానుకిదెగొనవె!
నమ్మరిగా పుచ్చుకోవె! సరగున ధరియించిరావె॥
మంధ:—వెర్రిచూడనమ్మ! ఆ వింతజూడరాను పొమ్మ॥ వె॥
వెఱ్ఱిదానవమ్మ చాల యెఱుగవు నీవీగోల
యొకరికతండుమ్ముగుబాల యెదురుచూడగ జాల॥ లె॥
కైక:—పంతమేల మనకు ఓయింతీ! పోదమతనికడకు॥ పం॥
వింతగునా గేహబాకను వేడుకతోనుండెగనుక
సంతోషము రామున్నకు సౌఖ్యము జనులందఱకు॥

మంధ:—అవును కపటంబువిడిచి మాట్లాడుటకు కైకయే తగును. కాలము మారెనని తెలియకుకొంబోలును. పాపము గడసరి గనుక కౌసల్య నాధుని చేబట్టుకొనెను ఏమిచేయుదును. విననివారికి మంచిచెప్పినను చెడ్డవలెతోచుచుండును. పోనిమ్ము నాకేమి వచ్చు తీసికొన్నగోతులలో వారే దిగెదరు. నాయావచ్ఛక్తియు ధారవోసి బోధించితిని. కర్మమును తప్పించుటకు నా తరమా!

కైక:—ఏమే మంధరా శ్రీరామపట్టాభిషేకమనిన సంతోష కార్యముగదా! నీకీ విచారమేల!

11 దేవగాంధారిరాగం—ఆదితాళము

మం:—ఎంతవెఱ్ఱిదానవమ్మ! యింతీ! మోసపోయెదవమ్మ పంత
గించికౌసల్యమ్మ కొంతసీ చేపట్టెనమ్మా॥ యెం॥ 2 మొన్న నేను

చింటినమ్మ యెన్నియో బోధించేనమ్మ విన్నవించేదాను వినుమా
నన్నుతాంగి నన్నువమ్మ॥ యెం॥ 3 మాయలాడి కౌసల్యమ్మ
ముదుపెట్టి త్రిప్పెనమ్మా నగనిమనసూ విరచెనమ్మా మాయలూ
తలకెక్కేనమ్మా॥ యెం॥ 4 ప్రేమ నీపై మరచేనమ్మ ఆశ్రాను
వలపోచికేనమ్మ నీమమునుమరుగంటేనమ్మ రాముడే నీశత్రూ
డమ్మా॥ యెం॥

కైక:—ఓసీ! చాలుఁ జాలు నీదుర్బుద్ధి యెల్లను తెలిసెను
మా యక్క నా కపకార మొనరించునా! నా నాథుఁడు వినునా.

చ॥ భరతునికంటె నాయెడల భక్తినిజూపురు రాముఁడెంతయున్
నిరతము ప్రేమనాపయిన నిల్పుచునుండును నాదునాథుఁడే
దురితము జేయబూనునటె తోడనుబుట్టినయక్కనాకు ఛీ
త్వరితముమాను బూటకము తక్షణమావలపొమ్మమంధరా? 12

వ॥ నీ పల్కులు చాలించి యిప్పటికి నడువుము. నాకు
బోధించకుము.

మం:—పోనిమ్మ నాకేమి! ఎవరికర్మము వా రనుభవించు
నప్పుడు జ్ఞప్తికి వచ్చును గాని నే చెప్పితే వచ్చునా కూనిమిచెప్పినను
నేరమువలె నుండును.

12 కల్యాణి—త్రిశజాతి

కైక:—ఇంతి! చాలుపొమ్మిక నీ హితవుచాలు లెమ్మికె? యెంతమంచి
దాసనైన నిఁక నిను నేనమ్మెదనా॥యిం॥ తెలిసెను నీగుణములెల్ల
చెల్లుననీకివి మేలా? చెలినీపల్కులుకల్ల చెప్పరాకుపోబాల॥ యిం॥

మంధ:—చాలునాదె నేరమా? నీ మేలుగోరనిష్ఠురము! చాల్ చాల్
నాదె నేరమా!—ఆవు దూడ యుండమధ్య గుంజయూచ్చు సామెత
యా? నాకెందుకు యీసంత పోమెదనింకొకరిచెంత పొందెదవూ
నీపుచింత యోచించుము యిదియెంత॥ చాల్॥

కైక:—పెద్దవాఁడు జ్యేష్ఠసుతుఁడు బుద్ధులసద్గుణశీలుఁడు అయోధ్యను నేలువాఁడు అతనిదాసునూభరతుఁడా యిద్దఱికిని భేదమెంచ యెప్పుడొప్పగునామనసు॥ యింతి॥

మంథ:—సవతికొడుకురాజ్యమేల సంతోషమునీకుచాల కన్నసుతుఁడు కష్టగోలకైనా! మాదిదిచాల ముందువచ్చు ముప్పుగనుము పెందలి కడ మేలుకొనుమా! సందియంబు లికనూనుము! సుతునిమేలు గోరుకొనుము॥ చాల్॥

కైక:—యూరేఁపుబానిసలోనవిహరించెడు రాముఁన్న సంతోషముతోడ నున్న చెప్పతరమ! సౌఖ్యమెన్న॥ ఇంతి॥

మంథ:—క్షితియెల్లను రాముదాసువరదుండే పాలించును గతిలేకను సీతనయుని కావిడిచ్చి మోయించును॥ చాల్॥

కైక:—ఓసీ! నీ దాసీ దుర్బుద్ధి నే నమ్మను శ్రీరామచంద్రుఁడు రాజ్యము పరిపాలించ ప్రజలకును మనకును సౌఖ్యమును చెప్పెద వినుము.

ఉ॥ ఆమహనీయుపట్టణమునందు వసించెడువారలాత్మ ని
ష్కామఫలంబె సత్ఫలముగాఁ దలపోసి ముముక్షుధర్ములై
రాముని దివ్యమంగళు నిరంతరమున్ మదిసంస్మరించి
యుద్ధామతిదీయరూపములఁ దాల్చి సుఖంచుచునుందురెప్పుడున్

వ॥ కావున నాకు సమ్మతమే శ్రీరాముఁడే రాజు నీ మాట నే వినను.

మంథ:—పోనిమ్ము నీ మేలు నీకే తెలియనపుడు నే చెప్పితే వినెదవా! నీవంటివారు యెవరైన ఉండెదరు నాకు. నే బోయెదను

(రెండడుగులు ముందుకుఁబోవును)

కైక:—మంథరా! యెక్కడికిబోయెదవు? నిను విడచి నే నొక్క క్షణమయినా యుండజాలను. నీ కింత కోపమేల? పోనిమ్ము.

చెప్పుము మంచిమాట అయిన వినియెద. లేకున్న మానెద. (చేయి పట్టుకొనును) పెద్దదానవును చెలికత్తెవును కనుక చెప్పుము. నను నీవు పాడుజేసెదవా? యెల్లప్పుడును నామేలు కోరుచుండుదానవు.

మంథ:—కైకమ్మా! చిన్నతనమునుండియు నీయింటఁ బ్రతుకు చుండి నీకపకారంబుచేసెదనా! నేపటినుంచి నీ కష్టము చూడలేక ఇంత నొక్కి చెప్పుచుంటిని. నీ బ్రతుకు జెడవేసునా! శ్రీరాముండే రాజ్యంబేలిన సుఖంబెల్ల కౌసల్యాది నీగతి యేమౌను. సుమిత్రయు నందులోనిదేకదా వృద్ధుఁడయిన నీ భర్త యెల్లకాలము నుండడుకదా శ్రీరామ లక్ష్మణు లిద్దఱును నొకటి. శత్రుఘ్నుఁడు వారికి ముద్దుల తమ్ముఁడుకదా. సీతాదేవి పట్టాభిషేకమునకు రాణియే అవును ప్రభులందరును రామునాజ్ఞాబద్ధులయి యుందురు. యెటుచూచినను నీ తనయుండగు భరతుండును—నీవును వేఱు. నేపటినుండి రామునకు సీతకుఁ సేవకుడయి చేయరానిపనులన్నియుఁ జేసి సకలకష్టము లనుభవించును కౌసల్యకు సీతకు నీవు దాసివై యుండుదువు లేకున్న అన్నవస్త్రంబులు కఱవగును. నా మాట నమ్మకున్న నీవే యాలోచించుకొనుము. మంచిమాటలచే భరతుని తాతగారింటికని శత్రుఘ్నుని జతగాఁ బంపి నీ తనయుఁడు పురమున లేకుండఁ జూచి శ్రీరామునకుఁ బట్టముకట్ట నెంచిరి. ఈ రహస్యము నీ కేమియుఁ దెలియదు మూర్ఖురాలవు ఇది అంతయు నేఁ గనిపెట్టి నీతోఁ జెప్పవచ్చితిని. చూచుచుండగనే అజ్ఞానమునఁ బడక నా మాట వినుము. ఎవరికి నిష్ఠురము రాకుండు నట్లు నేనొక యుపాయము చెప్పెదవినుము నామాటత్రోసివేయకుము.

కైక:—మంధరా! నీ మాట నిజముగనే తోచుచుండును. ఎవరికిని నపాయములేకయుండు నా మార్గమెద్దియో త్వరగాఁ దెల్పుము. నీ యిష్టానుసారముగ జేసెదను.

13 డైలాగు యదుకులకాంభోజరాగం—ఆదితాళము

మంథ:—మూర్ఖురాలవమ్మా! నీకు ముందువచ్చు మాప్పొసవ్వా కోర్కెలునీకుగలవు కోరితేసుఖించేవు॥ మూ॥

కైక:—మంథరా! కోర్కెలేమి గలవు వివరించెప్పవేమే! సుందరీ! వల్కవేమే సందియము బాపావేమే॥ మం॥

మంథ:—చెప్పితే వినేదవా! అప్పుడే మరచితివా! తప్పకాకోగదవా? దైవము సాక్షిగాను॥ మూ॥

కైక:—అదియేమొ తెల్పూవా! విని విధిగానుచేసెదను పదిలముగను దాని పట్టు నెరవేర్చెదను॥ మం॥

మంథ:—యిచ్చెదనునుపూనీకు మెచ్చిరెండువరములను పుచ్చుకొనకుంటివిపుడూ వచ్చెనూ సమయము॥ మూ॥

కైక:—వనిత నే కోరుకోను వరములూ యీ రెండూను వనితయే వేనాథుని వేగమే అడిగేదనూ॥ మం॥

మంథ:—ఒకటి మన భరతునకు పట్టాభిషేకామును రామువదునాలుగేండ్లువనవాసమును యీవరములు రెండునూయిపుడేకోరుకొను॥

కైక:—మంచిదే ఉపాయమూ లేదిందు అపాయమూ వంచించేదను రాము వనితాసాక్షేదైవము ధర రామదాసూనకూ దైవమూ రామూనికి దండకారడవులకు దారి నే చూపేదేనూ॥ మం॥

మం:—కైకమ్మా! ఇప్పటికి వచ్చినదికదా! నీ నాథుఁడు వచ్చువేళ మైనది. నాకుసెలవిమ్ము నేఁబోయెదను.

కైక:—నిజముగాఁ బోయెదవా?

మం:—(రెండడుగులు వైచి వెనుకకుఁ దిరిగి) కైకమ్మా! కోరెదవా? నీమాట నాకు నమ్మకమేనా? మమ్మాటికిని.

కైక:—చెలియా! వరములుకోరుటయే సత్యము. భరతుఁడు రాజ్యమేలుటయే సత్యము. శ్రీరాము నడవిఁబోయుటయే సత్యము.

నామాట నమ్మరు. సూర్యచంద్రులు గతులుదప్పినను నాప్రతిన తప్పను. ఆభగవంతుని పాదమాన. ఇప్పుడే ప్రయత్నంబుచేసెద. మంధరా! నీవు చాల ఆయాసముఁ దోచెను. మొదట కోపించితినని నీమనస్సున నుంచుకొనకుసుమా! చెలియా! సెలవుగైకొనుము.

మం:—అమ్మా! నేపోవుచుంటిని. మఱచిపోకుసుమా! (అని వీధిలోనికివచ్చి) అమ్మయ్య! ఇప్పటికి నామనస్సు తృప్తిపొందినది. ఆకైకకు నచ్చఁజెప్పునరికి నాపెద్దలు దిగివచ్చిరి. ఇఁక శ్రీరాముని కైక దప్పక అడవికి పంపును. నాపగతీరును. నన్ను బంతితో కొట్టి నాకు పగవాఁడై కౌసల్యకొడుకు ఈరాజ్య మేలునా! కైక నాచేత నున్న కీలుబొమ్మని యెఱుఁగడు. నాఆలోచన. అతనినేకాదు. సూర్య చంద్రులనయినను మార్చగల సామర్థ్యము నాకుండెను. సామాన్యు రాలనా! ఇఁక హాయిగా నిద్రించెదను. (అని నిష్క్రమించును)

కైక:—ఆహా! నానాథుఁ డెంతపనిచేసెను. నా సుతుఁడు లేకుండఁజూచి కౌసల్యా మాయలోఁబడి మన్ను మోసపుచ్చి రాజ్యము దానికొడుకు వశముచేయునెంచెను. కానిమ్మికార్య మెట్లు జరుగునో చూచెద. కానిప్రతినబట్టి వరములు కోరెదను. భర్తగారు వచ్చువేళయినది. సకలాభరణములు తీసి మలినవస్త్రంబు ధరించెద. తల్పమువిడచి నేలపైఁ బరుండెద మందిరమెల్ల చీకటిగాఁజేసెద. తగు విధాన మాలోచించెద.

(అని మలినవస్త్రమును ధరించి నేలపై పరుండియుండును)

[ప్రవేశము దశరథుఁడు]

దశ:—(అటునిటుఁజూచి ఆశ్చర్యముతో) ఆహా! ఏమి కైక ందుఁబోయెను. కనుపించదు. కారణమేమైయుండును. (మందిరం బెల్లఁ బరికించి పడియున్న కైకనుగాంచి) ఇదియేమో! చిత్రముగ

నుండెను. శ్రీరామచంద్రునికి రేపే పట్టాభిషేకంబని వేడుకతోఁ జెప్పవచ్చిన యీమెకీ విచారమేల? నాపైఁగోపమా? ఏమియో! దైవయోగ మెట్లుండెనో! తెలియదుకదా! అయినను శాంతవచనంబులచేఁ బలుకరించెద. సఖియా! కైకా! ఈ కటికచీఁకటిలో నేలపైఁ బరుండనేల? కారణమేమి?

సీ॥ హంసతూలికతల్పమందు పవ్వళింపక హరిణాక్షి నేలపడియుండినావు!
కనకాంబరంబులఁ గట్టుచుండెడినీవు మలినవస్త్రముఁ దాల్చియుంట వేల!
నవరత్నమయభూషణములఁ దాల్చెడునీవు భూషావిహీనవై పొరలనేల!
కాంచినంతనె ప్రేమ కౌఁగిలించెడు నీవు కారణం బేమి గాంచవకట!
సవతులేమైన నిందింపసాగినారొ? సేవకులు నీదునాజ్ఞల సేయరొక్కొ
ముఖ్యపరులు నిన్నేమిపల్కిరో పణతి తప్పు బేల కూర్చుండి
నాతోడ వేగ చెప్పు॥

వ॥ కేకయరాజపుత్రీ! నాపై నీకకోపమేల? నేను నీయందతి ప్రేమచే మెలఁగుచుంటినికదా! చెలియా! వేగముగాఁ జెప్పుము. నీకపకారంబొనరించినవారి కండకావరం బణఁచెద. లెమ్ము.

కైక:—నాపై ప్రేమచేతనే కాఁబోలును పాపము! ఇంతగా నను బ్రతిమాలుచుంటిరి. ఇక మీప్రేమచాలు నాదరికి రాకుడు.

ఉ॥ ఇక్కడికేల వచ్చితివి యింకను టక్కరిచాలు పొమ్ము నీ
మక్కువటాలు పెద్దసతిమాటకి కేఁకి? వేగఁబొమ్ము నీ
చెక్కిలినొక్కి ముద్దుగొను చేడియఁగూడుము అంతెగాని నా
ప్రక్కకు రాకు మ్రొక్కెదను పద్మదళాక్షుని సాక్షి భూవరా! 15

దశ:—చెలియా! నన్ను మాటలచే నొప్పించనేల? కారణము చెప్పక నాపైఁగోపమేల నీయిష్టము వచ్చినట్లు నడచెదను. నన్నుఁ బరీక్షించనెంచి యిట్లనియెదవా? నీపై నాకుఁగల యనురాగము నీవెఱుఁగవా? చెప్పుము.

14 శహాన—అటతాళము

దశ:—అలుకాబూనగానేలనే? కలికీ!కలికీ! కలికీ! చిలుకలాకొలికీ!॥అ॥
అతివారో! నీమనసు ఆయాసామేలానే ఆదారించెదా వేగమే!
తెల్పూ! తెల్పూ! తెల్పూ! మనసునా తలంపూ॥ అ॥

కైక:—చెప్పితెయికా చెల్లునా?మాటా!మాటా! కౌసల్యసాటా!॥నేజె॥
ముగ్ధాలా యిల్లాలువద్దా నుంనుము నీకు బుద్ధియొల్లనూ తెలిసెరూ
లెమ్మూ! లెమ్మూ! లెమ్మూ! యింక లేచిపొమ్మూ॥ చె॥

దశ:—నెలతారో నన్నిట్లు నిష్టురోక్తులాడ నేరా మేమిాచేసితీ?
చెప్పూ? చెప్పూ? చెప్పూ? నేచేయు తప్పు॥ అ॥
ఇప్పూడె నీకోర్కె తప్పాకా తీర్చెదా యిష్టాము చేకూర్చెనూ!
నమ్మూ! నమ్మూ! నమ్మూ! ఇకనేలలెమ్మూ!॥ అ॥

కైక:—ఇప్పూడన్నమాట తప్పాక యీధరణీసాక్షిగా నిల్చెదవా?
నిజమూ! నిజమూ! నిజమూ! నిను నమ్మవశమూ!॥ చె॥
సుజనాహితుండూ పుట్ట రామదాసునిబ్రోచు శ్రీరామసాక్షి
యేనా? రమ్మూ! రమ్మూ! రమ్మూ! అభయమూస్తమిమ్మూ!॥ చె॥

దశ:—కైకా! నాయందు విస్వాసములేదా? నా యీ దశ
రథుండు సూర్యవంశంబున బుట్టెను! మాట తప్పుననుకొంటివా?

సీ॥ పడమరదిశయందు భానుండుదోచిన చంద్రతారలు వేఱుసరణిజనిన
సప్తసముద్రముల్ జలహీనములయిన ననలుండుశీతలుండయినఁగాని
తారాప్రజంబెల్ల ధరణిపై దుల్లిన బహువిధబాధలు ప్రబ్బికొనిన
గీ॥ సుతులకును నాకు దూరమై వెతలొదవిన
రాజ్యమే పూజ్యమైనను రమణి వింటె!
పరమ పావనమైన యీ భానువంశ
మందు జనియించి యనృతంబు లాడటయను॥

ప్రళయాగ్నిచే జగంబెల్ల భస్మంబైన కులపర్వతములెల్ల కూలబడిన
(ఇది పైసీసపద్యములో మూడవచరణము)

వ॥ యీ రవికులదర్శనము నీ వెఱుఁగవా? చెప్పెద నాక ర్ణింపుము మా వెనుకటివారి చరిత్ర. అట్టి సద్వంశంబునఁ బుట్టి అనృతమాడెద ననుకొంటివా?

ఉ॥ మాటను దప్పలేకగద మానికిరాజ్యము ధారవోసి తా
బోటెనిగూడి కౌసలకు బోయి యనేకములైన బాధ ల
చ్చోటను బొందినైన నిజసూనుఁడు నీగినమైన సత్యమున్
చాటెను సూర్యవంశమున దా జనియించి త్రిశంకపట్టితాన్॥

దశ:—కైకా! యిప్పుడయినా జ్ఞప్తికివచ్చినదా లేదా! మాది సత్యవ్రత ప్రధానమగు రఘువంశముగా నెఱుంగుము?

కైక:—ఆలాగునా! పాపము! అందుచేతనే కాబోలును ఇంత ధర్మమాలోచించితిరి. యీ మూఘరాలునోట మన్ను పెట్టి మాయలో ముంచితివి. కౌసల్య నీకు యిష్టముచేయునదియూ నేను నష్టముచేయుదానను కానిమ్ము నే వెళ్లెదానననికదా! మీ యాలో చన. నా యిష్టము తీర్చెదనంటివి కనుక కోరెదను. సత్యవాక్యా పరిపాలకుండవేని ఆడినమాట తప్పకుంటివేని ధర్మము దాటవేని చెప్పెద వినుము—

15 బౌరువ—ఆదితాళము

నాథా! నేదెల్పెదను మోదముతోనాకోర్కెను ఆదరించితీర్పుమార్యా! ఆలసించకా॥ నా॥ 2 కౌసల్యా పుత్రునికీ కట్టెదవాపట్టంబు? కార ణామేమి మాగతి యేమిజూపితివి॥ నా॥ 3 ఇంత మోసగాఁడవనుచు యెఱుఁగకుంటి నింతవఱకు పంతమేల మున్నడిగినవరములు నాకిప్పు డిమ్మి॥ నా॥ 4 మారాడక మనభరతుఁడు మహినేలగ వరమునొకటి శ్రీరాముఁడు చతుర్దశవత్సరములు అడవిబోవ యీవరములురెండును

నా కిప్పుడిమ్ము తప్పకను॥ నా॥ 5 అనృతంబులాడకుమా ఆడదాని మాటలనుచు అన్యాయంబనుచుమొంచి ఆగ్రహంబుజూపకుమా॥నా॥ 6 దండిగ మారేడుబాక నుండురామదాసునేలు పుండరీకాక్షునీ పదములాన మాటతప్పు॥ నా॥

దశ:—హా! కైకా! యెంతమాటాడితివి! ఓసీ! మూర్ఖురాల! యివి యేమివరములు!! భరతునికి రాజ్యమా! జ్యేష్టసుతునికి వనవాసమా!! సకలసద్గుణధాముం డగు శ్రీరామునిపై కోపమేల?

మత్తకోకిల

ఓసికైక! మహోగ్రరాక్షసి! ఓర్వలేకిక రామునిన్
గాసిబెట్టదలంచి నీవిటు కానికోర్కెలు కోరితే
భాసురాంగివటంచు నెంచియు భామ నిన్ వరియించితిన్
పాపకార్యము చేయుమంచన పాపినోరెటువచ్చెనే!

వ॥ ఓసీ దురాత్మురాల!

16 కమాచిరాగం—త్రిశ్రజాతి

పలుకా వాక్కెటులవచ్చెనే పాపాత్మురాల॥ ప॥ ఓ కలికీ! మా రవి కులమును కడితేర్చగ పుట్టితివా॥ ప॥ 2 దుష్టురాల జ్యేష్టసుతుని కష్టములను పాలుజేయ నీ కిష్టమాయెనా! సంతుష్టిదోచెనా నీ పుట్టిమునిగెనా ఛీ! దెష్టా పాపిష్టికైక॥ ప॥ 3 బిడ్డలగనలేద నీవు? దుడ్డువలె నుంటివితే వట్టిగొడ్డుపోతువా? యిపు డడ్డుజేతువా! మాఱొడ్డి పలుకవా! నీవు బిడ్డనుగనవా? వంకనడ్డిడిటుల మప్పెనా॥ ప॥ 4 అతివా! నీ గుణమెఱుగక అంధుడనై వరియించితి కపటువాశి కేకయోద్రా గర్భవాసి రాకాసి జాలిలేదటె దయచూపరాదటె దోషంబు గాదటె దుర్మార్గము పూనెదవా॥ ప॥ 5 దుర్మతి యీ బుద్ధి నీకు తోచెన యోర్వగలేక ధర్మాత్ముడు రామునిపై దారుణంబు బూనెదవా! పరుడటెవాడు పరమాత్ముడాతడు ఇది వరమటె నీకు

నీరాజ్యమేలునా? భరతుఁడు॥ ప॥ 6 రామదాసు నెల్లప్పుడు రక్షిం చెడు దైవముపై కోపమేల వచ్చెనీకు కారడవికి త్రోయుటకుఁ గారణ మేమె? రాముఁడేమిచేసెనే నే నిలువగలేనే తులువ మంచిచెడ్డ తెలియదా?॥ ప॥

వ॥ కైకా! నీకిది ధర్మమా? శ్రీరామునివిడచి నే నిలువ గలనా? నామాటవినవా? జ్యేష్టసుతుని రక్షించవా? భరతునికంటె ప్రేమగా జూచుదానవుగాద? నీకీమూర్ఖతయేల?

కైక:—అది నిశ్చయమే కాని రాముఁడు ఇందున్న భరతుఁడు రాజ్యమేలుచున్న—

చ॥ భరతునికేల రాజ్యమని భావనచేతురు పెద్దలందరుఁ
దురితముగాఁనె కైకయని దుస్సహులై నను నిందజేసి యీ
పురజనులెల్ల రామునకు బోధనజేతురు రాజ్యమేలగా
పరిభవమొంది నాసుతుఁడు పాత్రుఁడు నిష్ఠురమౌను భూవరా! 19

వ॥ ఆకారణంబున రాముఁ డిచ్చట నుండఁదగఁడు. నా సుతు నకు రాజ్యంబిమ్ము. రాముని అరణ్యమునకుఁ బంపుము. సత్యమును తప్పకుము.

దశ:—(కైకదరికేగి బ్రతిమాలుచు) కైకా! నాముద్దు చెల్లిం చవా? రాముఁడు నీతనయుఁడుగాఁడా? రాజ్యంబెల్ల భరతునకే యిచ్చెదను. శ్రీరాముని విడువజాల క్షమించుము.

17 శంకరాభరణము—ఏకతాళము

దశ:—దయాదరణనయాకరుణ ప్రియాభరణకావవే రాజ్యముఁ సౌఖ్య
ముఁ భరతునకే నొసగెదను రాము నడవి కనుపఁజాల॥ దయా॥

కైక:—ఒప్పనగున తప్పదగున చెప్పనగున కార్యముఁ ధర్మముఁ
సత్యముఁ విడచి పలుకసమ్మతమా దారుణంబుగానగఁ॥ ఒప్ప॥

దశ:--నిన్నటిసభలోన రాముని నెన్ని పిలిచి యీరాజ్యము నేలుమనుచు
పలికి యిపుడెటుల వనికిఁ బొమ్మందును॥ ద.యా॥

కైక:--అనృతంబు లాడనగునె? చింతను మునిగుండనగునె? పంతమేల
సీతాపతి నిపుడె పిలచి బాపువనము॥ ఒప్పు॥

దశ:--సంతులేక చింతమునిఁగి తపము చేసి పుత్రులఁగని వంతనుబొం
దించగలనా? వనితా! నీకిది న్యాయమా?॥ దయా॥

కైక:—ముందుచేసినట్టి బాస యొందుగలసె ధరణీశ నందనుఁడగు
రామదాసు వరదునాన పల్కితివే॥ ఒప్పు॥

దశ:—హా సుగుణాభిరామ! ఏమిచేయువాఁడ నిన్నడవికి పంపెదనా? ధర్మంబిడచెదనా? ముందుజూడ నుయ్యి! వెనుకకుజూడ గొయ్యి! కాన్పించుచుండెను. హా! దైవమా! ఏమిమాలోచన తెలియదేది? హా! విధి!

మ॥ కరుణొక్కింతయులేక నేనిపుడు కాఠిన్యమ్మునఁ బూని యీ
పరమాత్మున్ వని జేర పంపుదున పాపంబొడ్డిగట్టు యీ
ధరణిన్ రాఘవుఁడైన వాడెటుల ధర్మభోక్తుల్ బల్కు నీ
తరుణీనాథుఁడనౌట నేనొకఁడ ధర్మభోక్తుల్ బల్కితిన్॥ 20

వ॥ హా! సుగుణాభిరామ! నీ పట్టాభిషేక మిటు పరిణమించినదా! ఆహా! నే నేముహూర్తమున తలంచితిని. హా! తనయా! నీకు అరణ్యవాసమా? హా! దైవమా! శ్రీరామా! పుత్రా! నే నిలువజాల. (మూర్ఛిల్లును)

కైక:--సుమంత్రా! ఇటురమ్ము. నీవు వేగముగాఁబోయి కౌసల్యకుమారుఁడగు శ్రీరాముని మీతండ్రి కైకమందిరమునందుండి నిన్ను పిలువఁబంచెనని చెప్పి యతిత్వరితముగా రమ్మనుము. జాగు చేయకుము.

సుమం:—అమ్మా! నీ యాజ్ఞానుసారముగాఁ బోయి యాతని గొనివచ్చెద. (నిష్క్రమించును)

ద్వితీయ రంగము—కచ్చేరి

[పురజనులు ప్రవేశించియుందురు]

మొద:—ఆహా! శ్రీరామచంద్రుని పట్టాభిషేకమహోత్సవము సూర్యోదయ మగునరికి ప్రారంభించెదరని చాటించిరి కదా! ఆహా! ఆనేమున కన్నులపండువుగాఁ జూచుటకై ప్రజలెల్ల సందడిచేసి వచ్చుచుండిరి. ఇంకను ఏమియును సందడి లేదు.

రెం:—వారికి ముస్తాబులు కావలెనా?

మూడ:—ఇంతతొందరేల ముహూర్తంబు రావలెనా?

నాల్గ:—అల్లదే చూడండి. అచ్చట యెంత చిత్రముగ యుండెనో! (నిష్క్రమింతురు)

తృతీయరంగము—కైకమందిరము

(దశరథుఁడు నేలపై బడియుండ కైక నిలచియుండును)

[ప్రవేశము కొంతదూరములో శ్రీరాముఁడు]

శ్రీరా:—అహా! ఏమిహేతువచేతనో గాని నా వామనేత్ర మదరుచుండెను. భుజంబు లుప్పొంగుచుండెను. శకునంబు జూడ కీడులో మేలువలె దోచుచుండెను. కారణ మేమియోగదా! విచారింపనేల? కాగలకార్యము కాకమానదు. దైవమాయ తెలియ నెవ్వరితరము! అయినను ఆలోచింపనేల! మా జనకుండు పినతల్లిగారి యంతఃపురమునందుండి పిలచెనని సుమంత్రుఁడు చెప్పెను. అతి త్వరితముగా బోయెదను. ఎందుచేతనోగదా! ఆ! తడబడితిని. పట్టాభిషేకమహోత్సవంబని మాజనకుఁడు చెప్పినతోడనే మా పినతల్లి కైకమ్మ యేదియో బహుమాన మియ్యఁదలంచి పిలచెను. నాపై తన కుమారునికంటె యామె కెక్కువ ప్రేమగదా! (కైకదరికేగి)

జననీజనకుల కిదే నమస్కారము. జననీ! మాజనకుఁ డెచ్చటనుండెను. నన్ను బిలువనంపిన కారణంబేమైయుండును?

కైక:—నాయనా! శ్రీరామా! నేను చిన్న వరంబులు రెండడిగితిని. ఇచ్చెదనని విన్నతోడనే మీతండ్రి వివశుఁడయి పడియేమియుఁ బలుకక యూరకుండెను.

శ్రీరా:—అమ్మా! ఆవరంబులేమి? నాతోఁ జెప్పుము. వినఁ గోరెద జెప్పవచ్చునా?

కైక:—చెప్ప కేమి? యొకటి మన భరతునికి పట్టాభిషేకము చేయమంటిని.

శ్రీరా:—సరియే! రాజ్యంబు నెవ రేలిననేమి? ఇద్దఱము సమానులమేకదా? భరతుఁడే యేలుకొనును. తరువాత రెండవవర మెద్దియో జెప్పుము.

కైక:—తనయా! శ్రీరామచంద్రా! నీవు మాతాపితృవాక్య పరిపాలకుండవుకదా!

శ్రీరా:—తల్లీ! అట్లు సంశయించెదవేల? ఇతఁడు శ్రీరామచంద్రుఁడు సత్యవాక్యాధురంధరుఁడు. ధర్మపరిపాలకుఁడు. శాంతమే భూషణముగా ధరించి నీమనంబున సంకోచమెల్ల విడచి త్వరగా నానతిమ్ము. వేఱుగాఁ దలంపకుము. సందేహమెల్ల మానుము.

కైక:—రెండవదియా? నీవు మౌనివేషధారివై పదునాలుగేండ్లు అరణ్యవాసము చేయగోరితిని. ఇదివిని మీతండ్రి నాపై యాగ్రహంబున మండిపడి మాఱుపలుకక నచ్చట పడియుండెను. చూడుము. (దశరథుని చూపును)

శ్రీరా:—ఇంతియేనా? ఈమాత్రపుకార్యంబునకే చింతించవలెనా? తల్లీ! నీ తనయుఁడే రాజ్య మేలును. చింత విడువుము. (దశరథునికడకేగి) జనకా! నీవిట్లు విచారింపనేల? సత్యమేజయము.

ధర్మమే దైవము. నిత్యసత్యవ్రతుండవయిన నీకీ సంకోచమేల? న్యాయంబు విడువ సమ్మతికాదు—తమ్మునికి పట్టాభిషేకముచేయుము. మాపినతల్లి కైకమ్మకు సంతోషముకూర్పుము! నేనరణ్యమునకుబోయి పదునాలుగువత్సరములు పదునాలుగు క్షణములువలె గడపి వచ్చెద లేచికూర్చుండుము. చింతవిడువుము. తనయులకుఁ బితృవాక్య పాలన కంటె వ్రత మేమున్నది. తల్లిదండ్రులకంటె దైవ మెక్కడయుండును. మన రవికులమున విచారం బెప్పుడును లేదు.

దశ:—(తల పైకెత్తి) హా! తనయా! సుగుణాభిరామ! నీకు అరణ్యమా!

ఉ॥ హా సుకుమార రామ నిను నక్కట కాన చరింపఁబంపు నీ
దోసపు కార్య మేనెటుల దుష్టుడనై యొనరించువాడ రా
కాసిని పెండ్లియాడ నది కానివరంబులు కోరెనేడు నిన్
శాసిన నాదుప్రాణములు శాయకయుండున పుత్రరాఘవా! 21

వ॥ శ్రీరామచంద్రా! ముద్దులతనయా! నిన్నుబాసి యొక్క క్షణమయిన నిలువజాలను. హా! రామ! నీకు వనవాసమా! హా! పుత్రా! సకలసద్గుణధామ! శ్రీరామ! (అని మూర్ఛిల్లును)

శ్రీరా:—తల్లీ! జనకునకు నుపచారంబులు చేయుము. నేనిప్పుడే మా తల్లియైన కౌసల్యతో విన్నవించి సెలవుగైకొని సీతాలక్ష్మణులతోఁజెప్పి త్వరగాఁబోయెదను. ఈ తడవునకు మన్నించుము.

కైక:—అట్లువీలులేదు. ఇప్పుడేపోవలయును. త్వరగాజనుము.

శ్రీరా:—తల్లీ! ఇది ధర్మవిరుద్ధముకాదా? సెలవుపుచ్చుకుని పోయెదను. నీయాజ్ఞానుసారముగఁ బదునాలుగు సంవత్సరములు అరణ్యవాసముచేయుదును. సెలవు.

(అని నమస్కరించి తండ్రికి వలగొని నిష్క్రమించును)

## చతుర్థరంగము—సీతాదేవిమందిరము

(సీత సకలాభరణభూషితయై నిలచియుండును)

సీత:—ఈదినంబున నా మనోహరునికి పట్టాభిషేకంబు చేసెదమని అలంకరించుచుండ సుమంత్రుడు నానాథుని చిన్న అత్తగారింటికి తీసకునివెళ్లెను. కారణ మేమైయుండును. మఱచితిని. ఈ వేకువనే పినతల్లికమ్మ నానాథునిపై ప్రేమాతిశయంబున నేదియో బహుమాన మియ్యదలంచి పిలువనంపియుండును. వారే! భర్తగారు సంతోషముతో వచ్చుచున్నారు. ఏదియో గొప్ప బహుమానం బిచ్చెను. నాకుమాత్ర మివ్వకపోవునా?

[ప్రవేశము శ్రీరాముడు]

శ్రీరా:—మనోహరీ! నాకొక్క చిన్న కార్యంబు నెరవేర్పవలసి వచ్చెను.

ఉ॥ సారసనేత్రి నిన్ విడచి సౌఖ్యములెల్లను బాసి మౌనినై
క్రూరతబూని కానలను కొన్నిదినంబులు ప్రొద్దుపుచ్చి నిన్
జేరగవత్తు నావ్రతము చెచ్చరదీర్చిచి నీమదిన్ మహా
భారముగాఁ దలంపకుమ భామరొ! ధైర్యముబూనియుండుమా!

సీత:—నాథా! ఇదియేమివింత నిన్ననేకదా మీతండ్రి నిన్ను పట్టాభిషిక్తుని చేసెదనని యయోధ్యాపురంబంతయు నలంకరింపఁ జేసెను. ఇంతలోనే యీచిత్రమేమి! ఆహా! పిన్నత్తగారు పిలచి యిచ్చిన బహుమానమా యేమియిది!

18 జంగ్లా—అటతాళము

శ్రీరా:—వినుమా భూజాత నే వనములకరుగావలసెను సీత మనమునను
చింతించబోకుమ వినయముగ నేవచ్చువఱకును ఘనముగను నీ
అత్తమామల యాజ్ఞమీరక యిచ్చటుండుమ॥ విను॥

సీత:--ప్రాణేశ! మీకు పని యేమిగలిగె ఘోరావనమునను కారణం బదియేమొ తెల్పుఁడు కానన భూములు మసల పాల్పడ విశదముగఁ దెలియఁగ జెప్పుడు వేగమే నా చింతదీర్పుఁడు॥ ప్రాణే॥

శ్రీరా:--చెప్పెదవినుమా పినతల్లి కైకవరములు గనుము ఒప్పుగను భరతునికి రాజ్యము తప్పకను పట్టంబుకట్టను ఇప్పుడే పదునాలుగేండ్లు వనమునకునను బాపుమనియెను॥ విను॥

సీత:--నాథా! మీ పలుకు నా కర్ణములకు నాటిన ములుకు వాదమేలను మీకుసేవ జేయువత్తు మహానుభావ భేదమెంచకు సాధు వేషముదాల్చి పోవుద మిద్దరాము॥ ప్రాణే॥

శ్రీరా:--అయ్యో! సుకుమారీ! నాతోడ నడువ జాలావెనారీ! భూమిపై నడుగిడగ వెరచెడు పొలఁతి మృదు చరణారవిందము లెట్టు ఓర్చును కంటకంబులు కటికుఱాళ్లు తీక్ష్ణాతపములు॥ విను॥

సీత:--పతిచెంతనున్న సతులకు చింతకలుగుటసున్న సతతమును మీపాదసేవ స్మరణ విడువక చేయుచున్న కటికుఱాళ్లే మృదువు లగును వేడిఘూప్పులు చల్లనౌను॥ ప్రాణే॥

శ్రీరా:--ఏమిచేయుదును నీ బాధలఁజూచి యెట్లోర్చెదాను కోమ లాంగి నీకుకష్టము జూచుటకు నా ప్రాణ మొప్పదు భామరో నీవచ్చుటకు సమ్మతి లేదాయెనాకు॥ విను॥

సీత:--ముద్దుచెల్లించు నాతలపు నీబుద్ధి నూహించు హద్దుమీఱితి ననుచు కోపము వద్దు మీరెఱుగనిధర్మము ధరణిఁగలదా రామదాసుని కరుణజూచెడి పరమపురుష॥ ప్రాణే॥

వ॥ ప్రాణేశ! మీరిట్లనతగునా? చిన్నతనమునుండియు ప్రేమచేఁ బెంచిన తల్లిదండ్రులవిడచి మిమ్ముల వరించి దైవముగాఁ దలంచి ప్రతిక్షణమును మీ పదారవిందముల నాశ్రయించి యున్న యీ దీనురాలి విన్నపమాలించి మీవెంట గొంపోవుడు. ఆజ్ఞయిండు. ఇదియే సతులకు వరంబు. సతులకు పతిసేవకంటె భాగ్యమేమున్నది.

శ్రీరా:—మనోహరీ! నామాటవినుము. నీ వేమనుకుంటివో కాని యెఱుగవుసుమా!

అష్టపద సీసము

శ్రీరా:— కడుభీకరంబులౌ కాననంబులుగాని
వనితరో! యవిపూల వనులుగావు
సీత:— కమలనేత్రా మిమ్ము కాంచినంతోడనే
వనములు కేళికా వనములగును
శ్రీరా:— క్రూరజంతువులుండు ఘోర గుహలెగాని
అతివ! సౌధంబులు నచట లేవు.
సీత:— పరమాత్మ నీపాదపద్మసేవను జేయు
దరులెల్ల మేడలై బరగునిజము.
శ్రీరా:— పంచ కఠినమైన బండరాళులెగాని
హంసతూలికపాన్పు లమరవచట.
సీత:— శ్రీరామ! మీ పాదసేవ జేయుచునున్న
శిలలెల్లయును మృదు శయ్యలగును.
శ్రీరా:— హరిగజశార్దూల హర్యక్షములెగాని
అలివేణి చిలుక కోయిలలుగావు.
సీత:— అండజవాహ నీ దండనుండిన నాకు
మెకములెల్లను శుకపికములగును.
శ్రీరా:— భీతిగొల్పెడు పెద్ద భూతంబులుండును
బాల వానినిగాంచి బేలవగుదు.
సీత:— క్రూరదానవులను కూల్పంగజాలిన
దివ్యదోర్బలుండవు దేవనీవు.
శ్రీరా:— కంటకములుండు కాంతరో కాననమున
మిక్కిలి రవికాంతినిచయ స్రుక్కుదీవు.
సీత:— ప్రాణనాథుని సేవ బాధలనడంచు
వేడిగాడ్పులు చల్లనై యుండుదేవ॥

19 శైలాగు కళ్యాణిరాగం—ఏకతాళము

శ్రీరా:--వద్దువద్దుసీత! నా బుద్ధివినుము భూజాత॥ వ॥
నిద్రాహారములుమాని ప్రొద్దుగడుపజాలవు॥ రావ॥
సీత:--నాథయీతవాద! నను విడచిపోవ మర్యాద॥ నా॥
మీదుసేవ జేయుచున్న బాధలుగలుగుటసున్న॥ నా॥
శ్రీరా:--నీవెఱుఁగవు కాంల నే చెప్పిన వినకుంటివేల॥ నీ॥
పావురములుగావు నీతోపలికెను చిలుకలుగావు కేవలమృగభల్లూక శార్దూలములుండువనము॥ వ॥
సీత:--మృగములేమి చేయునను ఖగములేమి జేయునాథ॥ మృ॥
దిగులేలను మీచెంతను జేరినడచుచున్న నన్నుజూచి క్రూరజంతువులే శాంతముబూనును నిజము॥ నా॥
శ్రీరా:--కాంతారమునందుపెద్ద భూతములుండును అందు॥ కా॥
భీతిచెందుదువుసిప్రనాతీ! నామాటవినుము రాత్రించరులను నెప్పుడు చూచియుండలేవు నీవు॥ వ॥
సీత:--క్రూరదానవులను కూలవేయగానుమీరు॥ క్రూ॥
విల్లమ్ములు మీచేతను దాల్చియుండ రాక్షసులు కేకలెల్లమాని భయముచేకొని పోకనునిలచునా॥ నా॥
శ్రీరా:--ఏలను నీ వింతసాహసమునుబూనుట కాంత॥ ఏ॥
తాళు తాళు చతుర్దశవత్సరములు గడవినంత నీలవేణి మనమంత యుండెదము ఒక్కచెంత॥ వ॥
సీత:--మిమ్ముబాసి నేను ఒక నిమిషమోర్వలేను నాథ॥ మి॥
సమ్మతితో రామదాసు నమ్మికొలచె నీపదంబు ఇమ్మహిలో నీకన్నను ఎవరిక నా దైవంబు॥ నా॥

వ॥ ప్రాణనాథ! సతినివిడచి వెళ్ళుమనుటకుమీతండ్రిజెప్పెను.

ఉ॥ ధర్మవిరుద్ధకార్యమిది తావకధర్మపురంధ్రి నన్ను నే
కర్మమెఱుంగనట్టి సతిగారుణికోత్తమ! యొంటిడించి పో
ధర్మమె నీకు నిర్విడచి ధామణిఁ ప్రాణముతోడనుందునే
మర్మమువీడి నీవెనుక మానుగఁజేకొనిపొమ్ము మ్రొక్కెదన్॥ ఉ

20 జంగ్లా—అటతాళము

సీత:--నామానధనామా! ననువిడువతగునా! నానోముఫలామా!॥
మీదుపొందెడబాసియుండగ రాదటంచుననుముందు మీరుజేసనట్టి
బోధకాద వాదమేలను ఆజ్ఞయిమ్మా॥ నా॥
శ్రీరా:--మిథిలేశపుత్రీ! నామాటవినుమా! సౌందర్యగాత్రీ!॥ మి॥
అతివరో స్త్రీ లడవిందిరుగగ వసుధలో నెపుడయినగంటివ వ్రతము
దీర్పగవలెను నాకు వాదమేలను నే నొప్పజాలను॥ మి॥
సీత:--నాపుణ్యపురుష మనవంశ పెద్దా లరిగిరి ప్రాణేశ
కౌశికునకునురాజ్యమిచ్చి కానలకుహరిశ్చంద్రభూపతి సతినిసుతుని
వెంటబెట్టుక చనగలేదే? రామచంద్ర॥ నా॥
శ్రీరా:--మునియాజ్ఞచేత తల మునిగియున్నా ఋణబాధచేత వినయు
ముగ కాశీపురంబున ధనముకూర్చి అప్పుతీర్పగం జనియె గాధే
సుతునిమాయచె సకలకష్టము లనుభవించె॥ మి॥
సీత:--పతివిడచియున్న అతివలాగన్న సద్గతిసున్న హితవునాపై లేక
యున్న యిప్పుడేనను ద్రుంచిపోయిన అఘములెల్లనుబాసి ముందు
జన్మకైకలసికుందూ॥ నా॥
శ్రీరా:--మెచ్చితిచాల నీపల్కు శాస్త్రయుక్తాముబాలా మచ్చకంటీ
నీమభక్తిని మానసంబును తెలియగోరి ఆజ్ఞయివ్వగలేదుగాని ఆగ్ర
హంబుగ జెప్పలేదు॥ మి॥
సీత:--అభయహస్తమిమ్మా మీ తల్లులాచే శలవుగైకొమ్మ ఫలిత
మొందెను నాదుజన్మము విడువజాలను మీదుపాదము త్వరితముగ
నే అత్తలచే సెలవుగొందును ఆజ్ఞయిమ్మా॥ నా॥
శ్రీరా:--శీఘ్రముగరమ్మా చింతనువిడచీ పైనాముగమ్మా వేగముగ
బోవలెను పుట్టా రామదాసుని ఆదరించి జాగుచేయక వనము
జేరి తండ్రిప్రతినను నిలుపవలెను॥ మి॥
వ॥ ఆహా! అట్లయిన త్వరితముగాబోవుదమురమ్మా. (నిష్క్రమింతురు)

## పంచమరంగము—సుమిత్రమందిరము

[సుమిత్రా లక్ష్మణులు ప్రవేశము]

సుమిత్ర:—తనయా! యీ వార్త వింటివా? కైకమున స్వప్నోనోగాని యిట్టి ఘోరకార్యము బూనెను.

లక్ష్మ:—తల్లీ! ఆ చిత్రమేమి త్వరితముగా సెలవిమ్ము.

21 డైలాగ్ దేవగాంధారి రాగం—ఆదితాళము

సుమి:--రారా! నా ముద్దుబాల రారా! సద్గుణశీల రాముడు రాజ్యమేల
క్షేమమనుకొంటిచాల|| రా||

లక్ష్మ:--కన్నతల్లిరో వినుము వేగమె సెలవిమ్ము నిజము అన్నగాక రా
జ్యము ఉన్న యెవరేలాడము|| క||

సుమి:--రాకాసికైక పట్టి ద్రోహము జేసే పట్టి కోరెనూ వరమూ గట్టి
కాని ప్రాతినబట్టి|| రా||

లక్ష్మ:--కారణము జెప్పావేమా! కైకమ్మ పాపాసేమె! కోరినా వరమూ
లేమె! దారుణము బూనూనేమె!||| క||

సుమి:--ధరణిరాజ్యము దాని తనయునాకివ్వామనీ దండకాటవికి
రాముని దయలేక పొమ్మనెను|| రా||

లక్ష్మ:--అన్నపై కోపామేలా? అడవికీ పంపుటేల! అమ్మకీ మూర్ఖా
తేలా! ఆహా! కష్టామూచాల|| క||

సుమి:--తల్లియే సీత యని తండ్రి శ్రీరామూలనీ తరలివారి సేవను
జేయుమా వనమూనను|| రా||

లక్ష్మ:--శ్రీరామ దాసూడను వారితో పోయెదను సీతారాములు
సేవను శిరసావహించెదను|| క||

వ|| తల్లీ నీ యాజ్ఞానుసారముగ వర్తించెదను వేగముగా సెలవిమ్ము సీతారాముల సేవకన్న సౌఖ్యమేల జననీ జనకుల వాక్యములకన్ననూ వ్రతమేల సీతారాముల తల్లిదండ్రులవలె జూచుకొనెద. నాకు సెలవిమ్ము.

సు:—నాయనా! సంతుష్టాంతరంగుడవై వెళ్ళిరమ్ము. (నిష్క్రమించుచు)

శుభమస్తు — అవిఘ్నమస్తు.

# పాదుకా పట్టాభిషేకము

## తృతీయాంకము — ప్రథమరంగము

కైకమందిరము

[ప్రవేశము కొంతదూరములో లక్ష్మణుఁడు]

లక్ష్మ:— ఆహా! పినతల్లి యెంతదారుణముఁ గావించెను! అయినను నేఁబోయి యొప్పచెప్పెద వినకపోవునా! అన్నను భరతునికంటెను యెక్కువప్రేమగాఁ జూచుచుండెను. ఇంతలో నీముఖ్యకృత్యమేమి హేతువనచేతనో తెలియదు. (దగ్గఱకు చేరి) తల్లీ! కైకమ్మా! ఇది న్యాయమేనా? ఈకార్యము చేయ నీమనసెట్లొప్పెను?

చ॥ కటకట! రామచంద్రునిటు కాననసీమకుఁ బంపవచ్చునా!
ఇటువలెఁ జేయ నీహృదయ మేక్రియ సమ్మతమాయెనమ్మ! హా
కటుతరమైన నీహృదిఁ గృపాంకురమింకెనె? దుష్టులెవ్వరీ
కుటిలత నీకుఁ జెప్పిరొ కదా యనె? రాముని కానకంపఁగా! 25

కైక:— (మౌనముదాల్చి తలవంచి నిలచియుండును)

లక్ష్మ:— తల్లీ! కైకమ్మా! మాకు పినతల్లివే! అవును. కాకేమి! శ్రీరామ పట్టాభిషేకము మాపినతల్లివే! ఇంతేకాదు. అయోధ్యాపురము జనులకు సంతోషము మాపినతల్లివే!! సంశయమేల: సకలసామ్రాజ్యవైభవంబులును మాపినతల్లివే!!! అనుమానంబేల మా రవివంశమెల్ల చెఱచినతల్లివే! మాకు పిన్న తల్లివే! అం

దుచే నిట్టి దుష్కార్యమున కొప్పుకొంటివి. జ్యేష్ఠసుతుని అరణ్యాను నకుఁ బంపి సుఖంబు ననుభవించెదవా!

22 జంఝూటీ—ఏకతాళము

లక్ష్మ:—కైకా! ఇటు చేయుదగున కొ కరుణయిన లేద॥ కైకా॥
కఠినురాల! జ్యేష్ఠసుతుని కారడవుల ద్రోసెదవా?॥ కైకా॥
ఐకమత్యమే బలంబటంచు మాకు నీతి తెల్పి
భరతుని రాజ్యముననిల్పి రాము నడవి పంపుటేల॥ కైకా॥
దుర్మతి! యీబుద్ధినీకు తోచెన? నీచెలి మప్పెన?
సుగ్మము లేకుండ చెప్పు మన్నించెద నీదుతప్పు॥ కైకా॥
కన్నతల్లికన్న నీవు గారాబముగాఁ బెంచుచుండి
కటకట! నీప్రాణమెటు లొప్పెను నాకాశ్చర్యము!॥ కైకా॥
మాతృద్రోహమనుచు నిన్ను మన్నించితి రాము
నాజ్ఞాబద్ధుడనై యుంటిగాని యుద్ధతిమై శిక్షింపన॥ కైకా॥
కేకయేంద్రునకుపుట్టిన రాకాసివికాని నీవు
కాకయున్న మాజనకుని శోకము నొందగ జేతువ॥ కైకా॥
నీ తనయునకేల నీవె నెత్తిగట్టుకో రాజ్యము అనుభవించు
అపవాదము అమ్మా! మేమేపోయెదము॥ కైకా॥
ధరణిలోన మారేడుబాక పురమున భక్తుడు
పుట్టి రామదాసు నేలినట్టి దేవునిపై నీకలుకబుట్టె॥ కైకా॥

వ॥ నిన్ననగనియేల శ్రీరాము డెంత వెఱ్ఱివాడు స్త్రీల మాటలను విని అడవికి పోవునా? ఎంతదారుణ మెంతదారుణము? రాముఁడే కాదు. ఈ యయోధ్యాపురవాసులందరు మూర్ఖులేనా? కైకకు బుద్ధిజెప్పువారొకరును లేరైరి. రాముఁ డడవికిఁ బోవ జూచె దరా? వారికేకాదు. మాతండ్రి మనసెట్లొప్పెను. ఇది వింతగా దోచుచుండెను. అన్నా! శ్రీరామచంద్రా! ఏమితోయట్లయినను, నిన్నడ

వికి పోవనిత్తునే! మహారణ్యమధ్యంబున సీతా కటకటా! కాళ్లపై నడచుట. యా! నూనదిన యతిసుకుమారి. జనకపుత్రి యీబాధలుసహించునే. కైక వరము లకోరుట యాభరతుఁడు రాజ్యమేలుటయునా! ఈకార్య మెట్లుజరుగునో చూచెదగాక! (రాముని కడకేగుచుఁ గోపావేశముతో కను లెఱ్ఱచేసి)

చ॥ అరయుగ నెల్లధాత్రికి నన్నును నే నభిషిక్తు జేసెదన్
అరమర లేల నాకిపుడు నష్టమువచ్చినవారి గూల్చెదన్
గురముచు జేసి కేకయుల దోర్బలశక్తిని జూపి ద్రుంచెదన్
త్వరితమెబోయి యన్నకును తత్క్షణమే యిపుడేను ద్రుముక్కెదన్ ॥

వ॥ శంకరుఁడష్టమువచ్చినను జయించి శ్రీరామునకు పట్టము కట్టెద. అన్నా! శ్రీరామచంద్ర ఈసుమిత్రాపుత్రుని జీవంబు లుండగా నిన్ను అరణ్యమునకు బోవనిచ్చునే? అట్లుజరుగదు. వీఁడు లక్ష్మణుఁడు. అకటా! ఎంతదురాలోచనజేసెను కైక. శ్రీమన్నారాయణుఁడైన రాముఁడు రాజ్యమేలునన్న నోర్వలేక యిట్టుపన్నినా యేమి? రామచంద్రా! పోవలదు. ఆగుమాగుము. అన్నా! రామచంద్రా! (నిష్క్రమించును)

## ద్వితీయరంగము

[ప్రవేశము శ్రీరాముఁడు సీత]

శ్రీరా:—ఆహా! లక్ష్మణుఁడు కోపముచే వచ్చుచుండెను శాంతింపచేసెదను.

లక్ష్మ:—అన్నా! శ్రీరామచంద్రా! కైకాభరతులను ఖండించి అయోధ్యాపురంబునకు పట్టముగట్టెద. అడవికిపోవలదు రమ్ము.

శ్రీరా:—

ఉ॥ కతమును బూనగాదగదు కైకనుదూరుట పాడిగాదు సూ
శిక్షితబుద్ధి నీవరయ లోపము జేయగ కన్నతల్లి యున్

రక్షకుడైన తండ్రియెడ రోషము బూనగ న్యాయమౌన యీ
తక్షణ మూరకుండుమిక తమ్ముడ భరతునకు కోపమాపుమా! 27

డైలాగు శ్రీరాగము—ఆదితాళము

లక్ష్మ:--ఎంత మోసపోతివగ్రజా! ఇనవంశదీప॥ ఎం॥
నీ వింత శాంతమూర్తి వైతే మెట్లుగడపెదవో కాలము॥ ఎం॥
శ్రీరా:--అనుజా యాగ్రహమాపుమా యీ దురితమేల?॥ అ॥
తలిదండ్రుల యాజ్ఞ మనము దాటవచ్చునా? జయమా?॥ అ॥
లక్ష్మ:--ఆడదాని మాటను విని అడవికి పోవగనుబూని।
పుడమిని సౌఖ్యంబుమాని యిడుములు బొందగనగునా॥ ఎం॥
శ్రీరా:--స్థిరమా? మనకీదేహము ధర నెవరికి శాశ్వతము దూరము
నాలోచించుము తరము! దాటగనజులిఖితము॥ అ॥
లక్ష్మ:--కైకయెవతె భరతుఁడెవరు కట్టెద నీకీరాజ్యము కేకయేంద్రు
డడ్డమున భీకరసమరమున ద్రుంతు॥ ఎం॥
శ్రీరా:--ధనమువచ్చు పోవుచుండు ధర్మమెపుడు నిలచియుండు కర్మ
వశము మారుచుండు మర్మమెఱుఁగువాఁడు ఘనుఁడు॥ అ॥
లక్ష్మ:--వీడెను నాయజ్ఞానము విశదమయ్యె సుజ్ఞానము విడచెద నేనీ
సౌఖ్యము నీ వెంటనేవత్తు నడవికిన్॥ ఎం॥
శ్రీరా:--నిత్యమునను దలఁచుచుండు నిర్మలమగు మానసుండు
రామదాసు కెల్లప్పుడు క్షేమమరసి యిచ్చుచుండు॥ అ॥

లక్ష్మ:—ఆహా! నీ వడవికిబోవుచుండ నేనిచ్చట యుండవలయునా!

గీ॥ ఒక్కక్షణమైన నినుబాసి యుండగలన
నిక్కముగ మీదుసేవయే నిత్యసుఖము
చక్కనైనట్టి నీ మృదుచరణములకు
మ్రొక్కెదను వెంటగొనిపొమ్ము మునిమనోజ॥ 28

24 శైలాగ్ జంగ్లారాగము—ఆదితాళము

లక్ష్మ:---అన్నా! మీకు కదీధర్మమా? నను విడచిపోవరామన్నా॥నీకి॥
నా పూర్వకర్మమా॥ అన్నా॥
చిన్ననాటినుంచి నిన్ను యెన్నడైన విడచితినా కన్నులెదుట లేక
యున్న అన్నా నే బ్రతికెదనా?॥ అన్నా॥

శ్రీరా:—తగునా? నాతోడవచ్చుట సౌమిత్రీ! నీకిది॥ త॥
నీ తరుణిని విడచీ॥ త॥
తండ్రియాజ్ఞ గడపిసేను తక్షణమే వచ్చెదను తమ్ముడ నాపల్కు-
లువిను తల్లిపైన శాంతమూను॥ త॥

లక్ష్మ:—తండ్రియాజ్ఞనీవుగడుప తల్లినన్నుబిలచిచెప్పె తల్లిసీత తండ్రి
రామ దైవములని మదిదలంచి యెల్లప్పుడు మిమ్ముగొలిచి సేవ
జేయ నన్నుబనిచె॥ అన్నా॥

శ్రీరా:—కారడవుల దిరుగఁగలవ కష్టములకు తాళగలవ కఠినరాళ్ళ
పండెదవా కందమూలములు భుజించి॥ త॥

లక్ష్మ:—అల్లనాదు మానివోట వెళ్ళలేద మనముజంట అధికబాధ?
అంతకంటె అరిగెద మీవెనువెంట॥ అన్నా॥

శ్రీరా:—తమ్ముడ నీ విట్టిపనికి తామసింపనేల? చాల యిమ్మహిలో
తలిదండ్రుల సేవజేయుము జాలమేల! తమ్ములకును చిన్న
తనము, దయతో నాదరించు చాల సమ్మతితో సేవజేయు సఖి
యను విడచుటమేల?॥ త॥

లక్ష్మ:—అన్న! నిన్నువిడువనేల? చిన్నబోయి బ్రతుకనేల? ఇవి
యన్నియు నిత్యములా? సన్నిప్పుడె నీకరమున మెఱయుచున్న
ఖడ్గముచే త్వరగా నాశిరమ్ముద్రుంచి పరమపదవి ననుజేర్చి యర
.. గును నన్నుపంపిఁచి॥ అ॥

శ్రీరా:—మెచ్చితి నీ ధైర్యమునకు మేలగు నిక చింతింపకు మనము
బోయి తల్లులకు మ్రొక్కి రామదాసునకు వరములిచ్చి పరము జేర్చి
వచ్చెద మన భక్తుండలరంగ॥ త॥

శ్రీరా:—తమ్ముడా! తల్లుల యాజ్ఞ జేకొని వచ్చెదము రమ్ము.

లక్ష్మ:—అన్నా! మీ యాజ్ఞానుసారముగ వర్తించెద.

(నిష్క్రమింతురు)

తృతీయరంగము—కౌసల్య మందిరము

[ప్రవేశము కౌసల్యా సుమిత్రలు]

కౌస:—చెల్లెలా! సుమిత్రా! నే నెటుల భరించుదానను నవమాసములు మోసి కనిన పుత్రుని కారడవులకు పంపుటకు కైక కే మెగ్గు చేసితిని? శ్రీరాముని విడనగలనా? ఆ కైకకు జాలియే లేదు.

సుమి:—అక్కా! కన్నప్రేమచే మనమిట్లు విచారించుటయే కాని సీతారామలక్ష్మణులు సంతోషముతో వచ్చుచుండిరి చూచితివా! అల్లదిగో!

[ప్రవేశము సీతారామలక్ష్మణులు]

శ్రీరా:—అమ్మా! మాకు అరణ్యమునకు సెలవిమ్ము. నీ చింత విడువుము తడవయిన కైకమ్మ కోపించును. త్వరితముగా బోవలయును.

ఆనందభైరవిరాగం—రూపకతాళం

కౌస:—క్షణమూ నిన్నెడబాసి తాళరా ముద్దుతనయా అడవికి
బోవనేలరా॥ క్షణ॥
పణతీకీ మనసెటులనొప్పెరా! రామ యీ పాపమెప్పుడు అనుభ
వించూరా!॥ క్షణ॥
బలుయండలకు నోర్వజాలను మీరు అలసి యాకలిచేత తాళరు
శత్రుత్వమంత సాధించేరా కైక పుత్రునిగని జాలిలేదురా॥ క్షణ॥

నీ తండ్రిమనసెటులొప్పినో దానిబోధలెల్లను తలకెక్కెనో ఇన వంశమున బుట్టినావుగా రామదాసూని రక్షించి బ్రోవగా॥ క్షణ॥

శ్రీరా:—తల్లీ! నీవిట్లు చింతించనేల? బ్రహ్మలిఖితము దాటవశమా?

ఉ॥ అమ్మరో! చింతబూనకను ఆజ్ఞనుయిమ్ము వనంబుజేరగా
సమ్మతితోడ నేగెదను సౌఖ్యముగల్గును మాకునందు యా
బ్రహ్మలిఖించె మానుకుట భ్రాంతినివీకుమటు కానకేగి పి
న్నమ్మనుకోర్కెదీర్చెదను న్యాయముదప్పక పోదుమమ్మరో!॥ 29

లక్ష్మ:—తల్లీ! మాకీ మూర్ఖతయేల? సీతారాముల సేవయే నాకు సకలసౌఖ్యములు. కావున అన్నకేమియూ లోపములేదు. శ్రమకలుగకుండ చేయువాడను నేను ప్రతినగడిపి వెంటసేవచ్చెదను.

26 నవరోజు—ఆదితాళము

శ్రీరా:--తల్లి! వినుమా! తడవాయె మాకు సెలవిమ్మా!
పిన్నతల్లీ వనముకెళ్లీ తిరిగి మళ్లీ రగన్యావెనమ్మా! నీ చెల్లీ!॥ తల్లి॥

కౌస:--తాళజాలరారా! నా ముద్దూలబాల॥ తాళ॥
వనముకేల?అనుగమేలా? విమనజాలయేమిమా సేతుమభ క్తపాల॥ తా॥

లక్ష్మ:--ఆజ్ఞమీరవలదమ్మ కైకాను దూర॥ ఆజ్ఞ॥
తల్లులార! తడవుమేరా అడవిజేరవడిగబోయెదము అమ్మలార!॥ఆ॥

శ్రీరా:--తుడువతరమా? యిది పరులచేత అజునిరాత కర్మచేత
వచ్చుభూత చేహము యిది మాయమూత॥ తల్లీ॥

కౌస:--ధరాకుమారీ యెట్లోర్చునయ్యా సుకుమారి
వనముజేరినడచుదారియొడపారినీడగోరిఆయాసామొందూనీనారీ॥తా॥

శ్రీరా:--మాటతప్పా పాటియనీకేది న్యాయమా
దాటవశమా!సౌఖ్యతరమామనకుజయమాఆజ్ఞగడపిపవస్తుమమ్మ॥త॥

సీత:--అత్తలార! సేవజేయగ బోదుపతికి ముంగుగతికీ
త్రోవవెదకీ మీదుసుతుకు మ్రొక్కేదనెపుడూ నాథునికీ॥ అత్త॥

కౌస + సుమి!—చేకొనుడయ్యా! బహుజయముగా
నిత్యసుఖముమీకుదయముకీర్తిఘనముగాచున్న పొందుసత్ఫలముగా!

సీతా + రామ + లక్ష్మ:—మాకు సెలవు.

కౌస + సుమి:—సుఖముగా వెళ్లి జయమునుపొంది క్షేమముగా వచ్చెదరుగాక! నాయనలార! జనకపుత్రి! అతిసుకుమారి! బహు భద్రముసుమా! (అందఱు నిష్క్రమింతురు)

చతుర్థరంగము—కైకమందిరము



[ప్రవేశము సీతారామలక్ష్మణులు]

శ్రీరా:—పినతల్లిగారి కిదే వందనము. తల్లీ అడవికిఁబోవ సెలవిమ్ము.

కైక:—కాంతారమున సుఖమవుగాక.

శ్రీరా:—

ఉ॥ వందనమమ్మతల్లి! వినువారక కాననకుఁ బోదునమ్మ నీ
నందనునందు నాయెడల నారిరో! భేదము నెంచకమ్మ యా
నందముతోడ రాజ్యమున న్యాయము దప్పగనీయకమ్మ యిం
పొందగఁ గోర్కెదీర్చ వనిపోవగ నాజ్ఞనునిమ్ము తల్లిరో! 30

లక్ష్మ:—

మ॥ అపరాధంబును సల్పినాడ జననీ అన్యాయదుర్భాషలన్
చపలస్వాంతుఁడ నేను పల్కితిని కంజాక్షిరో! రక్షింపుమా
కృపతో గావుము కోరి వేడితిని మగాకీభావముల్ బొందకన్
కపటంబేమియులేదు అన్నకరుణన్ గానకు న్నేబోయెదన్॥ 31

27 సైలాగు కమాచిరాగము—ఏకతాళము

శ్రీరా:—అమ్మా! సెలవిమ్మా! కైకమ్మా! వందనమమ్మా॥అమ్మా॥
సమ్మతితో బోదుమమ్మ తడవాయెను ఆజ్ఞయిమ్మా!॥ అమ్మా॥

కైక:--తనయూ! శ్రీరామ! పోయిరమ్ము సుగుణధామ!॥ తన॥
నిండుబలముజాలనేను అందమిల్లో నిల్వలేను॥ తన॥
శ్రీరా:--నిందకేలనమ్మ! నాడెందము ఆనందమమ్మ॥ నిం॥
సందియంబు మాను వనము సంచరింప సౌఖ్యమమ్మ!॥ అమ్మా॥
కైక:--దోషమనుచు నన్ను దూషింతురు జనులందఱు
రోషంబున బోరనేల పోషించుము జనులనెల్ల॥ తన॥
శ్రీరా:--తల్లిమాటకన్న తనయులకూ సౌఖ్యమెన్న
కల్లగాదు తమ్మునకు సమ్మతితో రాజ్యమిమ్ము॥ అమ్మా॥
కైక:--మానుదానపాల రక్షించవయ్య! ముద్దుబాల!
యింక జాలమేల వేగబోయిరా బాల॥ తన॥

లక్ష్మ:--పినతల్లీ! సెలవు. అన్నతో బోయివచ్చెద.

సీత:--అత్తగారూ! సెలవు.

శ్రీరా:--తల్లీ! నారచీరలును దండకమండలములును దయచేయుము. మౌనివేషధారులమై పోవుదుము.

కైక:--ఇవిగో! పుచ్చుకొనుడు. (అని నారచీరలు యిచ్చును)

(ముగ్గురు వస్తువులుదీసి కైకకిచ్చి నారచీరలు ధరింతురు)

[ప్రవేశము వసిష్ఠుడు]

వసి:--(ఆహా! జనకపుత్రిని జూచినైన జాలిలేక ఆభరణంబులును దుకూలాంబరములును పుచ్చుకుని నారచీరలిచ్చెను కైక. ఇది లోకవిరుద్ధముపలెం దోచును. నే నిప్పుడీసీత వస్తువులు వస్త్రంబులు యిప్పించెద) కైకా! ఇదియేమివింత! సీత స్త్రీగదా! నీకెట్లు మనస్సొప్పెను. నామాటవిని సీతవస్తువులును వస్త్రంబులును సీతకిమ్ము. ఇది ధర్మముకాదు.

ఉ॥ తోయజపత్రనేత్రినిటు తోడనుబుట్టిన వారిలోన న
న్యాయముజేసి పంపగను నామది కిష్టము లేమ భూషలన్

ఆయనకిచ్చి పంపవలె అక్కట! నాసుని వెంట బోవగా
శ్రేయము నీకు కైక! వినసీతకు చీరలొసంగి పంపుమా! 32

కైక:—భూపుత్రీ! పాపము! నీవస్త్రములు చీరలు ధరించు కొనుము. (అని యిచ్చును)

(పడియున్న దశరథునికడకు సీతారామ లక్ష్మణులు బోయి నమస్కరింతురు)

శ్రీరా:—తండ్రీ! నమస్కారము. నీయాజ్ఞానుసారముగ వనమున కేగెదము సెలవిమ్ము.

దశ:—(తల పైకెత్తిచూచి) ఎవరువారు. ఆహా! తనయా! శ్రీరామచంద్రా! సుగుణసాంద్ర! పుత్రా!

చ॥ కలకలలాడు నీముఖము కాంచగ కన్నులుబోయె కైకపై
వలపున రామ్మద్రోసెనసి వచ్చెకనింద భరింపజాల యీా
తలపుల కేల పోవలను తమ్ముడు యేలును రాజ్యమెల్ల నే
నిలువగ లేను నిన్విడచి న్యాయముగా విడబాసి పోవగ॥ 33

వ॥ హా! సుగుణాభిరామ! నినువిడచి ఒక్క క్షణమైన యుండజాలను. పోవలదు.

శ్రీరా:—జనకా! అట్లనుట భావ్యముకాదు.

కన్నడ దర్బారు రాగము—ఏకతాళము

ఓజనక! నేజనక పురమునుండ న్యాయమా? ధర్మముగ సత్యముగ విడువమీాకు సమ్మతమా॥ ఓ॥ 2 చింతయేలమీాకు! ఈ దీనతయేలను తండ్రి వంత నాకు లేదండి వనమున బహుసౌఖ్యముండి॥ ఓ॥ 3 ఆడితప్పకన్న దోషమున్నదె యిక సంకోచమేలనయ్యా? దశరథేశ చాలనాకు సంతోషము॥ ఓ॥ 4 సెలవునిమ్ము వేగలెమ్ము సంతోషివిగమ్ము ఫలములు దిని పర్ణశాల పండెదముమేము॥ ఓ॥ 5 పదునాల్గువత్సరములు ప్రతినగడపి వచ్చెదక విధిలిఖితము దాటవశమ? ఎంతవారికైనను॥ఓ॥

6 తల్లిపైన కోపమింక తగదు శాంతమూనుమా! ఎల్లరక్కసులను జంపి వేగ జయముగాంచెదవ్ మఱలివచ్చి రాజ్యమెల్ల పాలనంబు జేసెదవ్ కల్లగాదు భక్తుఁడయిన రామదాసు నేలెదవ్॥ ఓజనక॥

దశ:—అయ్యో! దైవమా! నాకీపుత్రశోకమేలకూర్చితివి? హా! తనయా! శ్రీరామచంద్రా! బ్రతికియుండగనె నీసుందరమూర్తి సందర్శనము కఱవాయెనా? నేనంధుఁడనయితినా! ఓసీ! కైక! నిను వరించినప్పుడే యంధుఁడనయితిని. దురాత్మురాల! నన్నీదుఃఖసముద్రమున ముంచెదవా? హా! తనయా! నేనెట్లు భరించువాఁడ? ఇఁక నాప్రాణంబు నిలుచునా!

మ॥ చతురంభోధి పరీతసంవృత ధరాచక్రంబు పాలింతువం
చతి సంతోషము నొందినానకట! నీ సౌఖ్యంబులన్ బాపి నే
నతికాఠిన్యముబూని కానలకు నిన్నంపంగ నూహింప నో
సుత! శ్రీరాఘవ నీమతల్లికిని హా! శోకంబు సేకూర్చితిన్॥ 34

వ॥ హా! తనయా! ఈ పుత్రశోక మెట్లు భరించువాఁడను! రామా!

చ॥ కటకట! రామచంద్ర! నిను కానలలో దిరుగంగఁబంపి నే
నెటుల భరింతు బ్రాణములు నిల్వవు వచ్చెద నీదువెంట యీ
పటుతర శోకమేల నిక పొరులువత్తును నాకుఁదోఁచు మే
మిట నిలువంగలేమికను నిచ్చట కైకయెయుండు రాఘవా! 35

వసి:—రాజా! ఇది ధర్మమా! నీవెఱుంగని ధర్మమున్నదా? పిచ్చిమాట లాడుచుంటివి?

శా॥ స్థిరమా దేహము నిత్యమా సుఖము శ్రేయంబె యీరాజ్యమున్
పరమాత్ముండగు రామచంద్రుడిల పురుషుం డూహింప కీ
సరికిన్ మెరుగక దలచితీవు సంతుష్టిం బొంపుమా
పురమేలున్ భరతుండు నీకతమ భద్రంబు భూమీశ్వరా!॥ 36

శ్రీరా + సీత + ల:—మాకు సెలవు. మేము పోయివచ్చెదము.

దశ:—ఎవరు అడవికిపోవుట?

శ్రీరా:—నేను లక్ష్మణుడు సీత మువ్వురము.

దశ:—హా! రామ! నా వాక్యమున పలుకగలనా పుత్రా! (మూర్ఛపోవును)

శ్రీరా + సీత + లక్ష్మ:—గురువరా! సెలవు.

వసి:—జయమగుగాక! సర్వజనసమ్మతంబగు సత్కీర్తి రయమ్మున గాంచిరమ్మా. సుమంత్రా! యీ బాలకులను రథముపై నధివసింపఁజేసి సరయూనదివఱకు కొనిపోయి యానదియొడ్డున డించిరమ్ము.

సుమం:—శ్రీరామచంద్రా! రథ మెక్కుఁడు. అంత నా మువ్వురు రథస్థులగుదురు. అశ్వములు నతివేగముగాఁ బోవును. వేగముగా రథము పోవుచుండును.

పంచమరంగము రాజవీధి

[స్త్రీలు ప్రవేశము]

చెలియా! చూచితివా! ఆ కైక యెంతద్రోహ మొనరించెనో! బాలురని యెంచక బిడ్డలుగని జాలిలేక సీతా రామ లక్ష్మణులఁ గారడవులకు బొమ్మనెను పాపము! రథ మల్లదె! పోవుచుండెను. చూచితిరా!

29 భూపాల—ఆదితాళము

స్త్రీలు:—పోవుచున్నారే! శ్రీరాములు అయోధ్యవిడచి॥ పో॥ తండ్రి
యాజ్ఞ తలనుదాల్చి దండాకారణ్యమునకు॥ పో॥ అయ్యయ్యో॥ 2
శ్రీరాముఁడులక్ష్మణుఁడు సీతయుసిరులెల్లవిడచి పోవుచున్నారే!॥3
దుష్టురాలు కైకయెంత ద్రోహము నొడిగట్టెనమ్మ! కష్టములకు

ఆసీత కాంతయెటులోర్చుకొనునో!॥ పో॥ 4 కైకజేసినట్టి ఘోరకార్యమునకు కోపించక కనిపెంచిన తల్లిదండ్రుల సకలవైభవముల విడచి॥ పో॥ 5 మహీతలంబెల్లను యీ మాయాలాడి కప్పగించి మాటాడకపోవుచుండి రెంతమంచివారో గాని!॥ పో॥6 కాయవస్త్రములనుదాల్చి కాననమున మౌనులవలె దండక మండలములుతులసిమాలలనుకంఠమునఁదాల్చి॥పో॥ 7 భీకరమగు విల్లమ్ములు డాకీలను దాల్చి ఘోర రాకాసుల బరిమార్పగ నట్టి యూహను మదిలోదలంచి॥పో॥ 8 ధరణిలో నూరేడుబాక పురమున భక్తుండు పుట్టి రామదాసు నెల్లప్పుడు రక్షించగ పురము విడచి॥ పో॥

వ॥ చెలియా! పాపము అతి సుకుమారి సీత యీ కష్టము లెట్లు సహించునో కదా! యెంతసాహసమునకు గడంగెనో సీత!

(అందఱును నిష్క్రమింతురు)



శుభమస్తు—అవిఘ్నమస్తు.

# పాదుకాపట్టాభిషేకము

## చతుర్థాంకము—ప్రథమరంగము

### కైకమందిరము

[దశరథుండు లేచును కైక నిలచును]

దశ:—హా! కైక! నన్ను పుత్రశోకమున ముంచితివా! పాపీ! యెంతపని జేసితివి?

30 జైలాగ్ మోహనరాగము—ఆదితాళము

దశ:—కటాకటా నా జ్యేష్టాసుతుని కాననమునకు బంపానగునా కఠినురాలకైకా! యిట్లు కానివరములు కోరనగునా? ఈ పటుతరం బైనట్టి పుత్రశోకము భరియించాగలనా యెటుల నోర్చెద సుతుని విడచి ఇంకా నేను బ్రతుకంగలనా కటాకటా! ఆ!ఆ!ఆ! ఆ నా జ్యే॥

కైక:—ఇష్టమూ లేకున్న యపుడే యివ్వకపోవ్వాటా మేలూ! కష్టమూచే నన్నూయిట్టి నిష్టురోక్తులాడానేల? దుష్టుడవైనన్ను యిప్పుడూ! దూషణా జేసెదవ్వూచాల జేష్టసుతునీ కివ్వకనను మాట్లాచే నొప్పించానేల?॥ ఇ॥

దశ:—తనయులాకై అఱువది వేలావత్సరములు తపము చేసితి మునులు దెల్ప యజ్ఞము చేసి తనయులానల్వురఁగాంచితి వారి వెంట చిన్నతన మూనందు వెంట వనమునకును బంపితి తనయుల కైకవరములు గోర దండకాడవిపాలు జేసితి॥ క॥

వ॥ హా! సుగుణాభిరామ! నిన్నెప్పుడు సుఖింపచేసితిని పుత్రా!

కై:—చింతనొందగనేల? కేపే చిన్నసుతులు వచ్చేదారు వంతవిడుమము వారూపీకు సంతసంబుగూర్చెగరు! పాతిగించీ సన్మానియిట్టి పల్కులా నొప్పించెదారు యింతిగా విలపించనేల? వచ్చెదరు నీ యాజ్ఞ సలిపి!! ॥

దశ:—కర్మఫలమూ! అనుభవించా తీరునా? నే జేసినపాపము కన్నుగానక మానీపుత్రుని వన్యమృగమని చంపినదోషము కిడ్లులేని వృద్ధమిథునము కనలుచు నిచ్చిన శాపము కిదసెనాకీ సమయమందూ గెలుగ జేసెను పుత్రశోకము!! క॥

కై:—కోపమేలనార్య! నాపై వాపమేమీ చేయలేను శ్రీపతి నీసుతుడైపుట్టి మోహమా నా కనివాడు అపదాలెల్లానశాసీ అఖిలజనులో సౌఖ్యమొందు పాపమూలెల్లాను శాసీ రామదాసా మోక్షమొందు॥ ఇ॥

దశ:—హా సుకుమార రామా! మిమ్ములవిడచి నేనిల్వగలనా! హా లక్ష్మణా! హా సీత! పుత్రా! శ్రీరామ! మిమ్ముల నేను వచ్చెదను. మిమ్ములవిడచి నే నిల్వగలనా? ఇదే వచ్చుచుంటిని.

(గొంతెచిగులు వేది తూలిపడును)

[కౌసల్య సుమిత్రలు చెరిగొక చేయి పట్టుకొని పరుండజేతురు]

(దశరథుడు తలపైకెత్తి) హా! పుత్రులార! మిమ్ములవిడిచి నే బ్రతుకగలనా! హా! పుత్రా! పుత్రా! లోకపవిత్రా! జ్యేష్ఠపుత్రా! ప్రాణంబులు విడచుచుంటిని. (అని మూర్ఛపోవును)

(కౌసల్య సుమిత్రలు చూచి విచారించ ప్రాణంబులుపోవును)

[ప్రవేశము వసిష్ఠుడు]

అమ్మా! పూర్వజన్మకృతము తప్పునా! యేమిచేయువారము ఊరడిల్లుడు దుఃఖ ముడుగుడు.

[ప్రవేశము రథముతో సుమంత్రుడు]

సుమం:—మునివరా! సీతారామలక్ష్మణుల నరణ్యముకుబంపితిని.

వసి:—సుమంత్రా! రాజగృహంబుననున్న భరతశత్రుఘ్నులను తోడ్కొనిరమ్ము జాగుచేయకుము.

సుమం:—ఆహా! చిన్నబాలురకు తండ్రి మరణవార్త యెట్లు తెల్పెదను. రామలక్ష్మణుల నడవికిబంపెనని కైకేయిని చెప్పినతోడనే జనకుని మరణవార్త విన్నతోడనే ఆ బాలురు యెంత కటకటంబడుదురోకదా! మహాసంతోషంబున లలి విరాజిలుచున్నట్టి యీ వార్త తెల్పెదనా మానెదనా? ఆలోచన యేమి చెప్పనే చెప్పను. వచ్చిన తరువాత వారికే తెలిసికొనును. త్వరగా దీసుకొనివచ్చెదను యీ వివార వార్త శ్రోత్రంబులకు తెలియకుండజేతును. (నిష్క్రమించును]

ద్వితీయరంగము—ఓడరేవు



[ప్రవేశము గుహుడు]

గుహు:—ఆ వచ్చెడివారు ఎవరైయుందురు? ఎక్కడికిం బోయెదరోగదా! బాలురువలెనుండిరి. పురుషులిద్దరు స్త్రీసుగుణనారి ఎవరోగదా! (నిదానించి) ఆహో! గొప్పవారివలెనుండిరి. కాని యీనారచీరలు కట్టెదరా? లేక వీరు మునికుమారులేమొ? అయిన నీ విల్లమ్ములు యుండునా? సరే! రాజకుమారులా! కారు. కాదు. రాజులు నడచివచ్చెదరా? రథగజతురగాది వాహననికరంబును పరిజనంబు లేదే? వీరివేషంబులుజూడగా చిత్రంబుగా దోచుచుండెను. ఏమైనను సరియే యుదియంతయు దెలిసినదాక నావ యెక్కనీయను. వీరి వృత్తాంతమంతయు నడిగెదను. ఏమియోకాని వీరిని జూచినప్పటి నుండియు నాకు నొకవిధమైన సంతోషము హెచ్చుచుండెను. కారణ మేమైయుండును.

[ప్రవేశము సీతారామలక్ష్మణులు]

లక్ష్మ:—ఎవరక్కడ?

గుహు:—బాబూ! నేను గుహుఁడనువాఁడను. కర్ణధారిని. ఈరేవున మార్గస్థుల నావపై దాటించువాఁడను.

లక్ష్మ:—అట్లయిన మే మీనదిని దాట పడవగడపుము. త్వరగాఁ బోవలెను. ఆలసించకరమ్ము. నీవడిగిన కానుక నిచ్చెదము

గుహు:—బాబూ! దాటించెదను గానండి! నాదొకమనవి.

లక్ష్మ:—ఏమి! చెప్పుము.

31 జైలాగు జగ్గా—ఆదితాళము

గుహు:--ఘనులెవరూ మీరూ? ఈ గంగదాటి ఏడ కేగెదరూ!॥ ఘ॥
మిమ్ములనుజూడగను నాకు మిగుల చిత్రము దోచుచుండెను సమ్మ
తిగోఁ దెల్పుఁడయ్యా! దాచకను వృత్తాంతమంత॥ ఘను॥

లక్ష్మ:--రాచబాలురమూ యయోధ్య దశరథేసు పుత్రులము॥ రా॥
తండ్రియాజ్ఞను గడపుటకు దండకాటవి చేరన స్త్రిమి
అతఁడు రాముఁడు లక్ష్మణుఁడనే యామెసీతా రాముభార్యా॥ రా॥

గుహు:--నమ్మాగబాలా! కానకూ జనకుఁడంపూట యేలా?
యిమ్మహీతల సౌఖ్యమెల్లను యనుభవించెడు కన్నపుత్రుల
వనముదిరుగగ పంపునంతటి కటికివాఁడా దశరథుండు॥ ఘను॥

లక్ష్మ:--పినతల్లికైకా మా జనకునీ జ్యేష్ఠాపుత్రూనీ వనము దిరుగగ
వెళ్లగొట్ట భరతుని పట్టాబుగట్ట ఘనముగా యీ రెండు వర
మూలు గోరె గట్టి ప్రతినబట్టి॥ రా॥

గుహు:--కఠినముచాలా కైకకుబుట్టె వరములుగోరా
దిట్టముగ నాసైన్యమెల్లను జేరి నడువగ నేగి యిపుడే
కట్టడీ భరతూనీ గొట్టి కట్టెదను పట్టంబుమీకూ॥ ఘను॥

రాము:--పినతల్లికైకకన్నకుమరుఁడనుజూడునాకూకోపమేలనువారిపైని
కోరికలు నెరవేర్చెదాను పాపకార్యముజేయలేనూ ప్రతినగడుపగ
బోయెదను॥ రాచా॥

గుహు:--వనముకేగనేల? నే జేతుమీకూ సౌఖ్యము చాల
వినయముగ నా రాజ్యమెల్లను ఏలుకొనుడు మీ సేవకుడనై
ధనము కనక వస్తు వాహనములను నిచ్చెద పుచ్చుకొనుడీ॥ ఘను॥
రాము:--తలిదండ్రి యాజ్ఞనెల్ల భక్తి పర్ణశాలాలనుండును ధరను
ఏలుట కిష్టపడనూ। దానవులనూ సంహరింతును। స్థిరముగా
శ్రీరామదాసుని చేరదీసి బ్రోచెదనూ॥ రాజా॥

గుహు:—ఆహా! ఏమి! దానవులనుచంపునట. జ్ఞప్తికివచ్చింది. తాటకినిజంపినవాఁడితఁడేనాయేమి? బాబూ! మీరు ఆ పెద్దరక్కసిని జంపేసిరటమీరేనా?

లక్ష్మ:—ఔను. మేమే!

గుహు:—అయితే అప్పుడు దారిలో తాయి మనిసైందంట నిజమేనా? అందరు సెప్పుకుంటే విన్నాను సామీ!

లక్ష్మ:—ఔను. నిజమే! ఆతాయి అహల్య. శాపవిమోచనం బయ్యెను. గౌతముని సతియు శ్రీరామచంద్రుని పాదధూళిచే పావనమయ్యెను.

గుహు:—ఆలాగునా? అయితే ఆచిన్నదిని నీవును ఎక్కండి. ఆ నల్లరాముడువద్దు. ఏమంటే పాదములుకడిగి దాటించెదను. లేకపోతే మోసమౌను.

శ్రీరా:—ఏమిరా! అట్లనియెదవు! త్వరగా దాటించుము మాకు తడవాయెను.

32 ఫేల్వా—ఏకతాళము

గుహు:--రామచంద్ర! తొలు! నా నావా యెక్కా వల్లగాదూ: రా॥
నేనమ్మలేను సామి నా బ్రతుకుదెరువు పోవునేమో॥ రాము॥
2 తాటకీనిగొట్టి యో దశరథసుపట్టి
దారిని బోవుచునుండగ జరిగిన చిత్రము వింటి॥ రాము॥

3 వాదమేల తాళు నీకు పాదధూళి సోకినంత
పెద్దశాయికరిగి మంచి ముద్దుగుమ్మ అయ్యేనంట॥ రామ॥

4 నల్లశాయి కరిగిపోయె నావజూడ పట్టికొయ్య
ఉండెను నాకిపుడుసఖియు యిద్దఱొద్దు రామయ్య॥ రామ॥

5 వెఱ్ఱివాఁడ గానూ! నే నేలుకొనాలేనూ
బల్ పోరు యిద్దఱితోను బాధించునయ్య వైకవలెను॥ రామ॥

6 చెపితే నే విననూ నే జలము తెచ్చెదానూ
నిలువూము చిప్పతోను లేకున్న నేను యొప్పుకోను॥ రామ॥

7 వట్టిమాటకాదూ వక వనితనాకుకలదు
ఇఁక పట్టుదలవద్దు నీపాదమ్ము యీపొద్దు॥ రామ॥

8 శ్రీరామదాసురాఁడు శుభ్రముగ కడిగెదాను
జలమైన పారబోయకను శిరసూన బెట్టి త్రాగెదాను॥ రామ॥

వ॥ (శ్రీరాముని పాదములుకడిగి జలము త్రాగుచు సంతోషముగ) ఆహా! ఇతఁడు శ్రీమన్నారాయణుండుగాని నరుఁడుకాఁడు. నాజన్మము పావనమాయెను. నేనెంతధన్యుడనో! నాకే తెలియదు. ఈతని నేనెంతని కొనియాడుదు. వేలకొలది సంవత్సరములు జడలను ధరించి ఫలములు దినుచు కొయ్యలవలె నూర్లాడక తపంబు చేయు వారలకైన నీ దివ్యమంగళవిగ్రహుని సందర్శనము దుర్లభము. అట్టి భగవంతుఁడు నేనున్న తావునకువచ్చి నాకు పాదంబులిచ్చి బ్రోచెను. నాపుణ్యం బేమని చెప్పవచ్చును. ఆహా! నాపాపంబులెల్ల బోయెను.

33 కమాచిరాగము—ఏకతాళము

ధన్యుడనైతి నేఁడాహా! ఈ దశరథపుత్రునిదర్శనంబున నేను॥ ధ॥
అన్యుఁ డనుకొంటిని ఆదివిష్ణుఁ డితఁడు
పుణ్యుఁడై వైకుంఠపురమూ నేలెడువాఁడు॥ ధన్య॥

2 హరియే నరుండై పుట్టినాండూ! అల్లశేషుండే యీలక్ష్మణుండు
తల్లిలక్ష్మియే భూజాతై యుండు కల్లగాదు కైకసుతుండు
శత్రుఘ్నుండు సల్లనయ్యారు శంఖుచక్రంబులై యుండు॥ ధన్య॥
3 జన్మంబులకెల్ల ఆది సకలజీవ్రాలకెల్ల నితండే యుపాధి
ఘోరకర్మంబులెల్లాను ద్రోలి నన్ను గాచూను యీసత్యనాధి
ధర్మముచెప్పక తండ్రియాజ్ఞనుగిడిపి దానవులను ద్రుంచి
సురల నేలెడువాండు॥ ధన్య॥
4 పాపంబులను శాపువాండు సకల ఆపాదలను బాపునేండు
కపటశ్రీంతెల్యూ నూయకాంచు పుట్టారామూదాసునిబ్రోచినాండు
చేపట్టి నాకిపుడు మోక్ష మిమ్మాతాండూ॥ ధన్య॥

వ॥ బాబూ! పొద్దుపోయింది ఈరాత్రివిశ్రమించివెళ్లుదురుగాని?

(అలాగుననే కొంతిసేపు విశ్రమింతురు)

శ్రీరా. గుహుండా! సూర్యోదయుంబగుచుండెను. మాకు తడవాయెను.

గుహు:—బాబూ! పడవ తీసుకువచ్చెదము. ఓరి గంగులూ పడవ తీసుకురండిరా! శ్రీరాముని త్వరగా దాటించవలెను.

గం:—ఇదుగో! శెప్పినికట్టె మొక్కమను.

గుహు:—బాబూ! ఎక్కండి.

(ముగ్గురు ఎక్కెదరు పడవలాగుటకు ప్రారంభింతురు)

గం:—ఓరీ! సూరిగా పదమాడరా?

సూరి:—నూపాడుదూ!

వెంక:—నాగన్న పాడతాడురా!

గం:—పాతపదా లొద్దురా!

సూరి:—కొత్తపదా లెవరు సెప్పతారు?

గుహు:—నేనుపాడతాను వెనకాల పాడండిరా బాగాను.

క్నా చుక్కానీకెల్లరా!

పదవపాట, 34 కాంభోజిరాగము—ఏకతాళము

గుహు:--రామ! రామా! రామ! రామా! సీతారామ॥రా॥ స్వామీ! సుగుణాధామ క్షేమముగ బ్రోవరామ॥ రామ॥ 2 తండ్రియాజ్ఞను గడపాపుండరీకాక్షూడు దండాకాటవికొచ్చె నిజమువేడుకతోడ॥రా॥ 3 తిప్పపల్లంజూచి తప్పింపు చుక్కాణి చప్పున బోదాము త్వరగాను లాగండి॥ రా॥ 4 గాలి వచ్చూచుండె గట్టు పట్టకుండ జాలారులారా! బల్ మేలుగా లాగండి॥రా॥ 5 పడవెళ్లిపోతుంది వడివడిగ తడబడక నడయేటునుంపుమా య్య గడియారు చేరెదము॥ 6 రామబాసూవరదూ క్షేమముగమనమంతా ఏమీభయమూలేక యావడ్డు చేరితిమి॥ రామ॥ (పడ వాపెదరు)

గుహు:—బాబూ! ఈరేవుని జాగ్రత్తగా దిగండి.

(సీతారామలక్ష్మణులు పడవదిగి గట్టెక్కుదురు)

శ్రీరా:—గుహుండా! ఇటురమ్ము. నీ కేమి కావలయునో కోరుకొనుము.

గుహు:—బగుమతే యిచ్చెదరా! స్వామీ! మీారెఱుగని దేమున్నది? నే చెప్పవలెనా? మిమ్ము నే దాటించితిగదా! నన్ను మీారు దాటించండి.

లక్ష్మ:—ఇదియేమిచిత్రము! మేము మళ్లీ దాటించవలెనా నిన్ను? నీనావయెక్కి పోమ్ము.

గుహు:—బాబో! అది సముద్రము నానావ యేమియు పనికిరా దందులో? దానిందాటించు నావ వేరు.

లక్ష్మ:—నీకుపిచ్చిపట్టినదా యేమి? ఇక్కడ సముద్రమెక్కడ నుండెను? కానుక పుచ్చుకొనుము. అన్నా! త్వరగా ఇమ్ము తడ వాయెను పోవలెను.

శ్రీరా:—(చిరునవ్వుతో) అనుజా! ఊరుకొనుము. నేనిచ్చెద. గుహుండా! ఏమి చెప్పుము నీకోరిక.

గుహు:—బాబూ!

## 35 కాంభోజి—ఆదితాళము

శ్రీరామా నన్ను దరికిఁజేర్చుమా యీ దుఃఖమందుండి॥ రా॥ ఘోరమైన సంసారసాగర మీదఁగజాలను॥ రా॥ దారుణంబుయొంచి సంసార జలధియందు ముంచి ఊపుకొన్న నాకు యేదారి గాన శక్తిలేక సారెసారెకును మిమ్ము దలంచుచు వేసారియుంటి బాధలను మోహపాశమును త్రెంచదింకమనసు ఆశయనెడు మాయలోన మోసపోవుచుంటి సామి!॥ రా॥ 2 పత్నియనెడు మకరినన్ను పట్టుకు బాధించుచుండ! పుత్రులనెడిజలచరములు ప్రేమతో నను పీకుచుండ నీగ తరిచే నాశయనెడు తరంగములు హెచ్చుచుండ గృహంబనెడు బడబాగ్ని గుప్తముగా మ్రింగుచుండ తత్తరమున నేనుపత్రి వగాన కానుఆర్తితోడనిన్ను స్మరియించితిభక్తితోను॥ రా॥ 3 దీనరక్ష బ్రోవకున్న దిక్కెవరు నీకన్న ప్రేమతో శ్రీరామ నామ మంత్రమనెడు నావనొసంగి అవలితట్టు జేర్చుము నన్నాదరించి రక్షింపుము॥ రా॥ శ్రీరామచంద్ర! నీవె సాక్షాత్ భగవంతుండవు శేషుండే లక్ష్మణుండు సిరియే సీతాదేవి యనుచు తెలిసి రామదాసు అజ్ఞానంబెల్ల విడిచె॥ రామ॥

శ్రీరా:—గుహుండా! పరమభక్తుండవు. నీవంటి భక్తులను రక్షించెదగాక! భవబంధంబుల బాసి మోక్షమును పొందెదవుగాక!

(శిరముపై కరముంచి అభయంబిచ్చును)

గుహు:—మహాత్మా! తమ దర్శనభాగ్యంబున నేను ధన్యుండనైతిని. నాకు సెలవిమ్ము. (నిష్క్రమించును)

సీతా + రామ + లక్ష్మ:—(త్రోవ నడచెదరు)

సీత:—నాథా! నీ పాదారవింద సేవ జేయుకతమున నాకేమియు ఆయాసంబు లేదు. ఈ యరణ్య మెంత సౌందర్యముగా నుండెనో చూచితిరా? ఆహా! ఇందుచేతనే అడవికి కాంతారమని పేరుపెట్టిరి. కావున స్త్రీలకును వనమునకును భేద మేమియు లేదుసుమా! ఎందుచేతననగా చూడగా నామనసునకు స్త్రీయని భ్రాంతిదోచుచుండెను

36 సావేరిరాగము—ఏకతాళము

నాథా! అడవి గనుమా! బల్ మోదమునొసగుచుండె మనసు॥ నా॥
ప్రాణనాథ! సాధుపులులింమున తిరుము సల్పుచుండిరిది ఫలితము॥ నా॥
2 వనితకును వనమునకును ఒప్పుచుండె నొక నామము
కనుగొనుటకు యీచిత్రము కనులకెంతో ఆనందము॥ నా॥
3 వింతపువ్వులు పూచి మన చెంతనున్న చెట్లుగాంచి
వింత వింత నగలుదాల్చి కాంత పెండ్లినాడు నిలచి
సంతసించు నట్లుదోచు భ్రాంతి గల్గుచుండె మనసు॥ నా॥
4 ఎత్తుగ నాచెట్ల నాగుత్తుల వ్రేలాడు పండ్లు ముత్తైదువైన స్త్రీల
వస్తువు లన్నిటీసంచుల క్రొత్తని పగడము గుండ్లు యుండినట్లు
దోచుచుండె॥ నాథా॥
5 నిద్రజెందుపిల్లలు భద్రముగనుండె యీపొదలపుత్రులుగన్నతల్లులు
స్తోత్రముజేయుచు జోలలు రాత్రులందు తమ బాలల లాలించి
నట్లు యుండె॥ నాథా॥
6 అల్లిబిల్లి తీగలు అల్లియుండె యీ లతలు కల్లగాను నీకథలు
అల్లె రామదాసు కృతులు కొల్లలుగా హరిభజనలు ఎల్లరేయి
నాటకములు॥ నాథా॥

(చిత్రకూటపర్వతము నెక్కుదురు)

లక్ష్మ:—అన్నా! ఇందు విశ్రమించెదమా! విశాలంబగు చెట్లు అతి చల్లనైన నీడ సౌఖ్యముగా నుండెను.

శ్రీరా:—తమ్ముఁడా! ఈ పర్వతరాజముపై పర్ణశాల నేర్ప రచుకొని వసించుదము. (అందఱు కూర్చుందురు)

శ్రీరా:—ఆహా! ఇప్పటికిగదా! నామనసు తృప్తిబొందినది. ఆ కైకమ్మ మాకుచేసిన మేలునకు ఎంతని యామెను కొనియాడుదును. మాతండ్రిని వరంబులుకోరి సన్నిందు సుఖింపజేసినందులకు యీమేలు నే మఱచెదనా?

సీత:—నాథా! మీ చెంతనున్న నాకు యీవనము దివ్యభవనము వలెనే యుండెను. (అని నిష్క్రమింతురు).

తృతీయరంగము—అయోధ్యయందలి రాజవీధి

[ప్రవేశము భరతశత్రుఘ్నులు]

భర:—తమ్ముఁడా! ఇది యేమిచిత్రము! మనపురం బిట్లు మారెనేమి?

సీ॥ కనులపండువగబోలెకాన్పించుమనపురి కారణంబదియేమొకో శదొలంగె
నింపువేడుకతోడనుండెడుజనులెల్ల నెపముజేసినయట్లు నెగడుచుండ్రి
రాజపుత్రులటంచు పూజజేసెడివారు రారుచూచియుదేల పిరలకట!
యేవేళజూచిన వింతగొల్పుమసభ యేమియోయిట్లుండెహీనమాచు

గీ॥ వేడుకలుబోయెను విచార మెక్కువాయె
చూడ దిగులాయె సంతోష శూన్యమాయె
పురము పాడాయె భోగము లరయ లేవు
చూడ భయమాయె చిత్తము శోషజెందె॥ 36

శత్రు:—అన్నా! తొందరపడనేల? కొంతసేపాగుము.

ఉ॥ అన్న విచారమేల నిక నంతయుఁ దెల్లము యింటికేగగా
గన్నకుమారుఁ డొచ్చెనని కాంచినతోడనె కౌగలించి యిం

కైలాగు చేసగా భరతుండు——ఆదితాళము

భర:--కన్నతల్లిరో! మామ కళసప్పియుండె నేమి కారణమిది యేమొ
కైకమ్మచెప్పవేమి!॥ కన్న॥
కైక:--రారా! నా వెంటిరూన రారా నే తెల్పెదను రారా యీ రాజ్య
మును రాజువై యేలుకొనుము॥ రా॥
భర:--అమ్మరో! యిటులాడ అన్యాయమౌను చూడ యిమ్మహిని నేలు
వాడు అన్నయే శ్రీరాముండు॥ కన్న॥
కైక:--ముద్దులతనయుడవు బుద్ధులెల్లనుడువు పెద్దలెవ్వరు పెద్దలిద్ద
రిలోను॥ రారా॥
భర:--జనకుండు జూడ లేడే! జానకీనాథుండ లేడే! జనని లక్ష్మణుం
డేడే జాగేల చెప్పిప్పుడే॥ కన్న॥
కైక:--అన్నయడవికేగెరా అయ్య స్వర్గముజేరె! నయోధ్యకిప్పుడీవు రా
యధికారుడైయుండిరి॥ రారా॥
భర:--అమ్మరో! అన్నరాము డరుగుటెందుకు వనము అయ్యబోవ
స్వర్గము అదియేమి కారణము॥ కన్న॥
కైక:--వరములుకోరితిని పుడమి నీవేలగను భరరామ చాపావనుండు
కారడవితిరుగగను మనలేక శోకాముతో మరణించె జనాకుండు॥

భర:——తల్లీ! యేమి యేమి! (చెవులుమూసికొని) కటకటా! ఎంత దారుణ మెంతదారుణము! అమ్మా! ఇది నిశ్చయమేనా!!! లేక పొరబాటా?

చ॥ కలవరమంది పల్కితివ కాక పరాకున తెల్యకంటివా
కలనయి రఘూద్వహుని కాననసీమకుం ద్రోయవచ్చునా
యిలను భరింపగాందగునె ఈవరమెట్టుల నీకుండోచెనే
చలనముబొందె నా మనసు చెప్పగ నీ మనసెట్టులోప్పెనే॥ 30

వ॥ అమ్మా! కైకమ్మా! నీవు వరంబులుకోరి అన్న నడవికి బంపితివా! ఆ కారణంబున మా తండ్రి మృతిబొందెనా! హా! దైవ

మా!! ఎంత కర్ణకఠోరంబగు మాటవింటిని! ఇది కలయా నిజమా! నే భరతుండనా యీ దుష్కార్యం బొనరించినది మా తల్లియేనా! కామకామ స్వప్నావస్థనుంటిని. అయ్యో! నిద్రకాదు చూచుచునే యుంటిని! అదిగో శత్రుఘ్నుఁడు అక్కడ నిలచియున్నాఁడను యిది నిశ్చయమే. ఈ దుర్మార్గురాలు మా తల్లియే! ఓసీ! దురాత్మురాలా! నీకీబుద్ధి యేలకలిగెను?

38 ధన్యాసిరాగము—ఆదితాళము

అమ్మా మనసెటులనొప్పెనే! అడవికిఁబంప తల్లీ ॥
యీ దుర్మార్గము కైకమ్మా నీమదికిదోచెనా? ఎవరైనమప్పెనా!॥అ॥
సమ్మతైన యీ కార్యము సలుపనీకు జాలిలేదా?॥ అమ్మా॥
అమ్మా! శ్రీరాముఁడేమి అపకారంబొనరించెను ద్రిమ్మరివై మెకార
డవుల తిరుగఁబంపితివనీవు? యిమ్మహిలో ఘోరపాప మెటువడిని
కట్టితివే?॥ అమ్మా॥
ఎన్నఁడైన ఈ రాజ్యము ఏలెదనని నీతోడను ముచ్చటైన ఆడితినా?
ముద్దులైన పల్కితినా? మొద్దువలె మాట్లాడవు మోమెత్తి
చూడవేమె!॥ అమ్మా॥
సంతోషము జెరచితివి శోకంబును గూర్చితివి ధరణియేలు శ్రీరా
ముని కారడవుల జేర్చితివి ధర్మాత్ముఁడు నూతండ్రిని నీవే బరి
మార్చితివి ఛీ! దుర్మతి నాకేలభూమి? నీ తలపై బెట్టుకొనుము॥
నీగర్భమునందుబుట్టి నిందలపాలైతినేను ఓ రాకాసి నిన్ను ఆ కేక
యేంద్రుడెట్లుగనెను పావనమగురవివంశము పాడుచేయబుట్టితివా?
కానివరముగోరి మమ్ము కష్టములో ముంచెదవా?॥ అమ్మా॥
ధరలో మారేడుబాక పురమునభక్తుఁడు పుట్టా రామదాసునేలి
నట్టి దేవుని పురి. వెళ్ళగొట్ట॥ అమ్మా॥
తగునా! యిది న్యాయంబగునా! ఛీ! దుర్మతి యీ ఖడ్గముచే
ద్రుంచెద నీ శిరమిప్పుడు॥ అమ్మా॥

వ॥ ఓసీ! మూర్ఖురాలా! యిట్టి ఘోరకార్యం బొనరించిన నీ మోముజూచిన ఘోరపాతకంబు ప్రాప్తించును. గాన ఇప్పుడే నా కరవాలంబున కెరజేసెద. నిలువుము దుర్మతీ! కితనాత్మురాలా కైకా!

మ॥ తులువా నిన్నిక జూడరాదు విను ఛీ! ద్రోహంబు లేదే నినున్
నిలువ న్రమ్మంచిన వానిపోషించుట కా! నిత్యంబు శ్రీరాముఁడా
బలవంతాసన్ వసియింప బంపితివి నీ ప్రాణంబు లెల్లొప్పినీ
తలపుం జేసేన యిట్టిబుద్ధులను నేతన్ని క్ష్యాన భోధించెనా॥ 40

39 కమాచిరాగం—ఏకతాళము

భర:--పాపీ నిను బ్రతికింపగరాదు యిపుడ యీ ఖడ్గముచే నఱకెద
దోషము లేదు॥ పా॥ పాపంబని తోచలేద బాధింపగ జ్యేష్టసుతుని
కోపంబాగుటలేదు కూల్చివేసెదను వాకు॥ పా॥ దుర్మార్గము
మదినిదలంచి దుఃఖజలధి జనకునుంచి దుష్కార్యం బాచరించి
దుష్టబుద్ధివై మా రవివంశమెల్ల జెరచితివి॥ పా॥ రాక్షసి నీ శిర
ముగొట్టి రామదాసునేలినట్టి రాముని పాదముబట్టి రాజ్యాంబతనికి
గట్టి రవివంశమునందుబుట్టి నట్టినింద బాపెదను॥ పాపీ॥

వ॥ కుమతీ! నీ గుణమే మాతాను. నీకు కాలంబు సరిపోయెను. లేకున్న నీకీ దుర్బుద్ధి పుట్టును. నిన్ను నరికెదను (అని ఖడ్గం బెత్త కైక భయముచే గడగడవణకుచు దూరముగా బోవును. భరతుఁడు వెంటనంట శత్రుఘ్నుఁడు భరతుని పట్టుకొనును)

శత్రు:—అన్నా భరతా! ఇంత మూర్ఖతయేల! ఆగు మాగుము. అన్నియు నెఱింగిన నీవిట్లు చేయఁదగునా? కన్నతల్లిని జంపుట మహాపాత మని వినలేదా? నిలుపుము. (భరతుని చేయిపట్టుకొనును) అన్నా యీ దురితమేల.

మ॥ నెలలున్ తొమ్మిదిమోసి నిన్ గనుచు నా ముద్దులయ్యంచు నీ
యిలలో పెద్దగ జేతునంచు భ్రమచే నెంతో ప్రేమగాజూచి

తలలో నాల్కగయున్న యీ కైకదే తప్పంచు నూహించి యీ
పలుమాటల్ పలుకంగతగునా పాపంబులు చెరుగవా॥ 41

40 జైలాగు చక్రవాకం—ఏకతాళము

శత్రు:--తాళుతాళుమగ్రజా! తల్లిని దూషించ దగున॥ తాళు॥
కాలునిచేయుప్పు ముందు కనుగొను యీబుద్ధిమాను॥ తాళు॥
భర:--కరమువదలు తమ్ముడా! కడితేర్చెద నీపాపిని॥ క॥
శిరముత్రుంతు దుర్మార్గము జేసినట్టి ద్రోహినిపుడు॥ క॥
శత్రు:--ఆడదానిజంపెదరా! యావనిలోన శూరవరులు అటుగాకను
కన్నతల్లి అసువుమంపుదు పెద్దలు॥ తాళు॥
భర:--తప్పుజేసినట్టి దాని దండింపక వినువనా యిప్పుడు నే విడచి
తినా తప్పక ముప్పొసగ్గును॥ క॥
శత్రు:--తప్పులేదు తల్లివల్ల తగదు శాంతమూనుమా చెప్పెద నా
మాటవినుము సిరికోరుట నేరమా॥ తాళు॥
భర:--రామదాసు నేలినట్టి రాముని యవతారముగ క్షేమమెల్లబాసె
యుండ జూచియూరకుందునా॥ క॥

శత్రు:—

ఉ॥ తప్పనియెంచకయ్య మది తల్లినిగొట్టుట పాడిగాదు నే
జెప్పెద నాలకింపుమిటు చేయగనేమియుఁ దప్పలేదు ని
కిప్పుడు మేలుగోరి సుతుకీయును రాజ్యమటంచు నాథునిన్
తప్పకవేడెగాని మది తప్పనితోచిన రామునుంపునే॥ 42॥

41 జైలాగు దర్బారురాగము—ఏకతాళము

1 శత్రు:--అన్న నాదుమనవినుమా అమ్మతప్పుగాదుసుమా విన్న
వించెదనునిజము అన్నా కోపముమానుము॥ అన్న॥
ఆలోచించక వరములు అడుగుమనుట జనకుతప్పు ఆడదానిమాట
నమ్మి అడవికరుగ అన్నతప్పు అలుకబూన మనకు తప్పు అడిగి
తెలిసికొనుట యిప్పు అంతయు నీవే చెప్పు॥ అ॥

2 భర:--తమ్ముఁడ! నీపల్కులెల్ల తగవు వినను వట్టికల్ల అమ్మదిగా
కున్నతప్పు ఆ కారణమేమి చెప్పు యిమ్మహిలో నీకన్నను వెఱ్ఱివా
రలుండరులోకాన నమ్మఁజాల నూరకొనుము సమ్మతిగాఁ దోచ
లేదు తమ్ముఁడ నా మనసొప్పకు తమ్మ వినుము నాకరము॥ త॥

3 కై:--చిన్నతనము యిందుసిజము విస్మరింతు మన్నించుము॥ చిన్న॥
కన్నకొడుకు నూ మాదరి కల్పించెను యీకార్యము సన్నుతాంగి
యెన్నెన్నో చాలగ బోధించిచెప్పె కన్నసుతునిమేలుగోరి కాంచు
ము సుఖమనుచుఁజెప్పె యెన్నఁకైన శ్రీరాముని కెగ్గించగనూహిం
తున? కన్నసుతుని కన్నను నేగారముగా జూచుచున్న రాము
నడవి బాప సన్నురమణి మాయ కనులగప్పె॥ చిన్న॥

భర:—ఓసీ మంథర! దురాత్మురాలా! యీ దుష్కార్యము నీ యాలోచనమూలమున సంభవించెనా? కులటా మాయింటఁ దిని మా యిల్లే చెరపితివా? నీ వక్ర-వినయం బెల్ల వినియోగించి జ్యేష్ట సుతుని సకలకష్టంబుల నొందఁజేయించితివా? నడుమలేని కుంటి దానివలె యీ కొంటెపని కైకకు బోధించితివా? నిన్ను క్షమింప రాదు. యీ కరవాలంబున నిన్నిప్పుడే ఖండించి కాలుపురికంపెదం నా కోపానలంబున దగ్ధంబుగావించెద పాపాత్మురాలా! ఇదే వచ్చుచుంటినని (మంథజుతికి రెండుగుద్దులు వైచును)

శత్రు:—అగ్రజా! యీ దురితమేల! నీకు తెలియదా?

4 శత్రు:--రాణీసుతుఁడు రాజ్యమేల రమణికి సౌఖ్యముకలదు మంచి
చెడ్డలేమితెలియు మంథరదాసీబుద్ధి చెలులసుఖము గోరుచుండు
తెలియద యీ లోకోక్తి ఫలితంబని యానారికితోచిపన్నె యీ
యుక్తి॥ అన్న॥

భర:—అది నిశ్చయమేకాని మా తల్లి యిట్లుచేయవచ్చునా!

5 భర:--దాసిమాట విన్నందుకు తల్లిది తప్పనితోచెను నీచంబని
తిలకించక నమ్మికాన కెటుద్రోచెను మోసంబని మదినెంచక మా

మెట్టుచూచుచునుండెను యీ రాకాసి కైకమ్మయె ద్రోహంబొ
తయు జేసెను॥ త॥

శత్రు:--వ॥ అన్నా! శాంతింపుము శాంతింపుము. స్త్రీల స్వభావములు నీ వెఱుంగవా! స్త్రీబుద్ధి ప్రళయాంతక మను నార్యోక్తి విన లేదా! చెప్పెద నాకర్ణింపుము.

సీ॥ అత్తమామల గాంచు నరయుచుండుట గాని చెలువార బూజలు
చేయరెవ్వరు
నిండుసంసారంబు నెంచు జేయుట గాని నెలతలెప్పుడు వంశవృద్ధిగనరు
ఒంటిగా కాపురంబుండ నొప్పను గాని పరుల సౌఖ్యము జూచి
యోర్వలేరు
వారి మేలేవారు కోరుచుండుట గాని దుష్టులు పతులనే తిట్టుచుంద్రు
తే॥ తెప్పపాటున జనులెల్ల గప్పుదారు
చెడ్డకార్యంబులైనను జేయగలరు
పాపపుణ్యంబులను మాట తలపగనరు
స్త్రీల స్వాభావికము లేమి? తెలియలేరు॥ 43

6 సుతుని మేలుగోరి పతిని నరకమునుగుట అతివకొప్పా
మతి నూహించుము అంతయు పనము లేక వచ్చె ముప్పా
హితవుగోడ మన అన్నను బ్రతిమాలుట చాల మెప్పా
క్షితిలో శ్రీరామన్నకు మేలు జేయ ఫలితము ముప్పా॥ అన్న॥

భర:—అనుజా! నీ పలుకులకు సంతసించితి. నాకన్నైను చిన్న వాఁడ వైనను బుద్ధికి బృహస్పతిని మించెదవని తోచుచున్నది. కాని పెద్దతల్లులగు కౌసల్యసుమిత్రల మోము లెట్లుచూతును. దుష్టుఁడనని నిందించెదరు. ఏమి చేయువాఁడ.

శత్రు:—అన్నా! సంశయించ నేల? తల్లులకు నచ్చఁజెప్పి వారిచింతలుమాన్పి అన్నకడ కేగి ఆసీతారామలక్ష్మణులను తోడ్కొని వచ్చి పట్టాభిషేకము సేయుదము. రమ్ము తల్లులకడ కేగుదము.

భర:—తమ్ముఁడా! ఆజ్ఞయిన పోవుచున్నాఁడను.

(నిష్క్రమించును)

పంచమరంగము—కౌసల్యామందిరము



[ప్రవేశము భరతశత్రుఘ్నులు]

భర:—పెదతల్లులకిదే నమస్కారము. మాతృపాదములకు నమస్కరిం తునుగాక!

కౌస:—ఓరీ! కపటీ! తల్లికి బోధించి తాతగారింటికి చని నాతనయు నడవులకుఁ ద్రోయించి నన్ను దుఃఖసముద్రమున ముంచి సిగ్గులేక నన్ను జూడవచ్చితివా? చక్కఁగా రాజ్య మేలుకొనుము. నాయనా! భరతా! నీతల్లియును నీవును సుఖం బనుభవింపుడు మాతో పని యేమి? మీకైనను సౌఖ్యముతో నున్న నంతేచాలును.

భర:—అమ్మా! నన్నిట్టి నిష్ఠురోక్తులచే నొప్పింప నేల? మన్నింపుము.

మ॥ అపరాధంబును సల్పలేదు జననీ యన్యాయమున్ జేయ నీ
కపటం బేమియు జేయలేదు దయతో గావంగదే వేడెదన్
ఎప్పుడైనన్ రఘురామచంద్రునకు నే నెగ్గెంచ నూహింతునా
కృపతో జూడుము కోరి వేడితిని యే కీడెంచకన్ తల్లిరో!॥ 44

42 బారువరాగము—ఏకతాళము

భర:—తల్లీ! కౌసల్యా! నే తెల్పఁబోవు మనవిను నా
వల్ల దోషమేమియు లేదు? దూషింపకుమా॥ తల్లీ॥
కైకమ్మకు మూమంధర కల్పించిన బుద్ధివిని
కపటము తెలియక అన్నను కారడవుల బంపెగాని॥ తల్లీ॥
3 మనవి విను నీతోడ నేను మాయమాట లాడితినా
మద్యపానము నే జేసెడి మందునిగతికే బోదును తల్లీ॥

శుభమస్తు — అవిఘ్నమస్తు.

# పాదుకాపట్టాభిషేకము

## పంచమాంకము — ప్రథమరంగము



రాజవీధి

(భరతుండు కావిగుడ్డలతో సంచరించుచుండును)

[ప్రవేశము వసిష్ఠుండు]

భరతా! ఎక్కడికేగియుంటివి.

భర:— మునివరా! నీరాకకై చూచుచుంటిని. ఇక తడవేలా! వెళ్లవలయును. సుమంత్రా! పురమలంకరింపచేయుము. శ్రీరాము చంద్రుని కోసము అడవికి వచ్చి పట్టాభిషిక్తునిగా చేసెద. సిద్ధముగా నుండవలెను.

సుమం:— భరతా! రథగజతురంగాది కాల్బలములు మంగళ వాద్యములు చెలంగ తీసుకొనివచ్చెదము. ఇందఱము పోవుదము.

పురజనులు:— రాజా! మేమును వచ్చెదము. సెలవిమ్ము. శ్రీరాముని చూచెదము.

కౌస + సుమి:— తనయా! మేమును వచ్చెదము.

కైక:— తనయా! నేనునువచ్చెదను. శ్రీరాముని నాతప్పులు క్షమించమని వేడెదను.

భర:— నీవు మనసొప్పినా! శ్రీరాముని మోమెట్లు చూచెదవు?

పుర:— అందఱును రండు.

జంఝూటి—ఏకతాళము

పుర:—రండయ్యో పోదాము! రాముగూడా మనము॥ రం॥
దండకారణ్యవనిలో నుండు రామునికడకు॥ రం॥
కైకజేసినట్టి కార్యము వినినట్టి కౌసల్యపట్టిని గాంచ మనసుబుట్టె
కనిపెట్టి శ్రీరాముబోయినదారి నిబట్టి కదలిపోవుచుండ కైకముద్దులపట్టి
పెంచినయూ కైక వంచించె రాముగాని మంచివాడుగనుక యెంచి
రాజ్యమూను అంచితంబుగ తాను అన్నకివ్వగాను అరగుచుండె
భరతుం డమ్మా తమ్ముతోను॥ రం॥
అయోధ్యపురవాసు లందరూగూడండి అరుగుదము మనమతివేగ
మే రండి ధరణిలో శ్రీరామునివాసస్థలంబు అరణ్యమున జేరి
వేడుకొందామండి! రం॥

ద్వితీయాంకము—సమాప్తము

[కొంతదూరమున గుహుండు ప్రవేశము]

గుహు:—ఆహా! యేమిది నేల యీనినట్లు ఆకాశంబును భూమియు నేకమై క్రమ్ముకొనునట్లు యీ ధూళి యేమో కదా! ఇది యేమిచిత్రము! యెవ్వఁడో చతురంగ సేనాసమేతుఁడై యుద్ధమునకు వచ్చునట్లు దోచుచుండె. హా! జ్ఞప్తికవచ్చినది శ్రీరాము నడవికిఁ బంపి కైకపుత్రుఁడు ప్రతినగడపిన వెనుక రాజ్యంబు రామునకిచ్చుట కిష్టంబులేక క్రోధంబుచే వచ్చుచుండెను. ఇదే నిశ్చయము నే నిప్పుడే ఆ రామునకు సహాయుండనై నా బలంబుల నెల్ల బిలచి వీని దంతంబుల్ బరిమార్చెద. ఓరీ! గంగులు!

గం:—ఓ! (పరుగెత్తివచ్చును)

గుహు:—త్వరగాబోయి మన సేనానాయకునితో మన బలంబు యావత్తున్ను విల్లునమ్ములతో నాయత్తమై యిచ్చటకు రమ్మనుము. జాగుచేయకుము.

45 కల్యాణి—ఏకతాళము

గుహు:—ఎంతకపటశాలి! భరతుండు శ్రీకాంతునడవికిఁద్రోసి యిపుడు సైన్యముతో వచ్చుచుండె॥ ఎం॥

శ్రీరా:—అయ్యో! తమ్ముఁడా! తండ్రి దివి కేగెనా? ఏమి చేయుదుము? బ్రహ్మలిఖితంబు దాటవశమా! నలుగురు పుత్రులముండి మరణకాలంబున నొక్కరమేనియు లేనైతిమి. ఇక విచారించిన ప్రయోజనమేమి? గురువరా! జనకుని కర్మ చేయుట కేమియాజ్ఞ?

వసి:—శ్రీరామా! నలుగురు పుత్రులు దమ్ము లుండిరి. పుణ్యనది గంగలో స్నానమాచరించి కర్మమొనరింపుము. (నిష్క్రమింతురు)

(తదుపరి అందరు స్నానమాచరించి వత్తురు)

వ॥ అన్నా! మనపురికి బోవుదము రమ్ము. మాతల్లి తప్పులను క్షమింపుము.

47 దైలాగు జంగ్రా—ఆటతాళము

భర:—అన్నా! మనవి వినుమా! నాపైన యింతా అలుకేల రామా!
చిన్నబాలుఁడ నిన్ను విడువను అన్న నీవయోధ్యకును జనుమన్నగా
యీ రాజ్యమెల్లను పట్టమును గట్టెదము నీకు॥ అ॥

శ్రీరా:—భరతా వినుము నేను యీ ప్రతిన గడచి విడవచ్చెదను తల్లి
దండ్రుల యాజ్ఞమీరిన తనయులేలను శాస్త్రిలోను ఉల్లమున సంశ
యముమాను తల్లి చెప్పిన బుద్ధులను విను॥ భర॥

భర:—ఏమి చేయుదూను మిమ్ముఁగొనిపోవుటె ఎట్లోర్చెదాను రామస్వామి
మీరు లేని క్షణము యుగముగఁ దోచునాకు దుష్టకైకా క్షేమమా
పెను సోదరుల నెడబాయఁ జేసెను॥ అన్నా॥

శ్రీరా:—పినతల్లి వగమా కనుగొనా మనమున హాస్యకరమా ఎఱుఁగని
వారలకు నేరము సర్వజన సంతోషకారము క్రూరదాసప గర్వాహ
రము మానుమా నీమది విచారము॥ భ॥

భ:—ఇది యేమి వింత! అజాడు నానుదుట వ్రాసిన వ్రాత! అగ్రజునకపకారి
నైతిని అందఱిచే నిందింపఁబడితిని దుష్టురాలు కైకగర్భావాసమందున
బలబడితిని॥ అన్నా॥ శ్రీరా:—తమ్ముఁడా! పురికి జేరుమా! ప్రతినగడచి
యిప్పటికీ యిమ్మహిని రవివంశధర్మము నస్మృతిగ యోచించి నిరతము
తమ్ములను దయతోడ జూడుము ఆదరించుము రామదాసుని॥ భ॥

భర:—అన్నా! మీరిట్లన భావ్యముగాదు. దయఁబూని రమ్ము. లేకున్న ప్రాయోపవిష్టుండనై నీపాదారవిందంబుల నాశ్రయించుకొని యిచ్చట నేయుండెదను. నేను పురికిఁ బోనొల్లను.

శ్రీరా:—అనుజా! మనమందఱ మిచ్చటున్న పురమేమగును?

భర:—జనులందఱిని పురికిఁ బొమ్మనెదను. జనులారా! యెల్లఱు నయోధ్యకు బొండు.

జను:—మీరీయరణ్యంబున నుండ మేమువ్వాలకు బోవుదమా? మీసేవజేయుచు నిచ్చటనే యుందుము. శ్రీరామునియెడ భక్తిలేనివార మనుకొంటిరా? మే మిచ్చటనే యుందుము. రాజులేని రాజ్యము మాకేల? శ్రీరాముని పాదసేవకన్న సౌఖ్యమే మున్నది?

శ్రీరా:—తమ్ముఁడా! వింటివిగదా! నీవు తెలియనిదా? ఊసితివినలేదా?

గీ॥ తనయులకు పితృాజ్ఞ సద్వ్రతముతలఁప
సతికి పతిసేవ మోక్షమ్ము స్వర్గదాయి
ప్రజకు రాజానుమతము ధర్మంబుకాదె?
అనుజ నీవెఱుగని ధర్మ మవనిగలదె॥ 59

వ॥ కావున తండ్రి నన్ను అడవినుండఁ బంపెను. తల్లి నిన్ను రాజ్య మేలుమనెను. వారియాజ్ఞలఁ దప్పవచ్చునా? నీవిచ్చటనున్న ప్రజ యుండదు. ప్రజలున్న ప్రపంచవిరుద్ధముగాఁ దోచును. పురము పాడౌను. లోకులు నిందించెదరు, నా పలుకులనువిని యయోధ్యాపురం బేలుకొనుము.

భర:—(స్వగతము) ఎన్నిచెప్పినను అన్న వినడయ్యెను. గురువర్యునిచే నొప్పించెద. (వసిష్ఠునికడ కేగి)

48 జంగ్లా—అటతాళము

గురువర్యమీరూ చెప్పినాపీరూ సమ్మతించెదరూ
ఎప్పుడును మీ యాజ్ఞ మీరరు ఒప్పుకొందురు తప్పులెంచరు
తప్పకీకార్యము రాముడు ఒప్పకుండిన మీదిభారము॥ గురు॥

వసి:—వినవోయిబాలా నీకు యీలీలా విచారమేలా
ఏమిచెప్పుదు నీయదృష్టము యికను లేనుస కేమికష్టము
ఘోరదానవులెల్లనష్టము పూనుమూ నీమదినియిష్టము॥ విన॥

భర:—అహా! యేమందు నాపూర్వకర్మ మేమనుకొందూ
ఒప్పుకొనడూ అన్న రాముడు చెప్పుటను గురుశిష్టపడడు
తప్పకను జనులెల్లఋప్పుడు చెప్పినను విని పురికిబోవరు॥ గురు॥

వసి:— తెలియగ వినవూ యిమ్మన్న పరమరహస్యము వినుమా
కపటమానుష విగ్రహుండు. కైకవరమున కాననుండు
కలుషరాక్షసులను సంహారించు కైకపుత్రా రామచంద్రుడు॥ విన॥

శ్రీరా:— గురువరా! నీతిబోధించి భరతుని పురికి జేర్పుము.

వసి:— భరతా! నేనొకరహస్యము చెప్పెదవినుము. రాముండు సీతను ఎవరిప్రతిన వారు గనుపుకొనవచ్చును. నిరంతరము శ్రీరాముని పాదసేవగదా! కోరితివి. కావున శ్రీరాముని పాదుకలు పుచ్చుకొనుము. సింహాసనమునందుంచి పట్టాభిషేకము జేయుము. మీరాయన్న పదునాలుగేండ్లు నిచ్చట గడపి వచ్చును. ఈకార్యము యిద్దఱకు శ్రేయంబౌను లెమ్ము.

భర:— గురువరా! మీరు మంచియాలోచన చెప్పితిరి. ఇప్పుడే అన్న పాదుకల పుచ్చుకొనెదను. అన్నా! నీపాదుకల నిచ్చిన నిరంతరము సింహాసనముపైనుంచి పూజించెద. ఈరహస్యము గురుడు సెలవిచ్చెను.

శ్రీరా:— అనుజా! ఇవిగో! పుచ్చుకొనుము. (పాదుకలనిచ్చును)

భర:— (పుచ్చుకొని) అన్నా! శ్రీరామచంద్ర! పదునాల్గు సంవత్సరములు గడచినపిదప తక్షణమె యయోధ్యాపురము రావలెను సుమా! నీవచ్చువఱకు నయోధ్యాపురము నేను పోను.

చ॥ కనుసదాల్చి పాదుకలు చేరెద నేనల నందిగ్రామముకా
పురమున గద్దెపైనునిచి పూజలు చేయుచు నెల్లనాల మా
హారము నిద్ర మానెదను నన్నులం గాముక బుద్ధిం జూడ జూ!
ముఖవశమాజ్ఞ; రావలెను మన్ననమందున సన్ననమ్మితి॥ 51

వ॥ అన్నా! శ్రీరామచంద్ర! అదియునుగాక ఇదిగో! నాప్రతిన వినుము.

చ॥ చనియెద వేగ అన్న! రఘుసత్తమ! ఇప్పటినుంచి నేను నీ
దినములు లెక్కపెట్టి మితి తీరినపిమ్మట రాకయున్న నే
ననలముజొచ్చి ప్రాణముల యాశను వీడెద నన్న రాము నీ
మనమున జ్ఞాపకంబునిడి మానక రావలెనన్న రాఘవా॥ 52

వ॥ అగ్రజా! పదునాల్గువత్సరములు పదునాల్గుయుగములవలె గడపెదను. మితిదాటిన ప్రాణములువిడచెదను. ఈపలుకులు సత్యము.

(కౌసల్య సుమిత్ర కైక మొదలగువారందఱుఁ బురికిరమ్మని కోర)

శ్రీరా:—తల్లులారా! బ్రహ్మలిఖితము దాటవశమా! మీమనసు సంకోచమెల్ల మాని త్వరగాఁ జనుఁడు. ప్రతినగడపి వచ్చెదము.

శత్రు:—అన్నా! మహాసేవ జేయుచు నే నిచ్చటనే యుండెద. నే పుణ్యశాలను.

శ్రీరా:—శత్రుఘ్నుఁడా! నాకు సహాయుండవై లక్ష్మణుఁడుండెను. భరతునకు తోడ్పాటయుండుము. సుఖముగా నయోధ్యకుఁ జనుఁడు.

రామచంద్రా! సత్కీర్తి గాంచిరమ్ము. మేము పోయివచ్చెదము.

శ్రీరా:—గురువరా! నమస్కారము గైకొనుము.

(నమస్కరించును)

(అందఱు సెలవుపుచ్చుకొని త్రోవలో నడచెదరు)

భర:—(పాదుకలు శిరముపై నుంచుకొని) అన్నా! సెలవు.

శ్రీరా:—జయమగుఁగాక!

## 49 నాదనామక్రియ—అటతాళము

శ్రీరామ రామా! సీతాపతి రామా! స్మరియింతు రామా! స్తోత్రము
వినుమా భక్తితోనూ భావమందు నానూ ముక్కి వేడెదనూ
ముదమొప్పగాను నీదుపాదుకనూ నాదుశిరముననూ పూనుకొనె
దానూ మోదముతోను॥ శ్రీరామ॥

నందిగ్రామములో నాదు ఫలితంబు ఉందూ నిరతంబూ పొందు క్షేమంబు॥
గద్దెపై నేనూ ఒద్దికాతోనూ పొందుపఱచెదనూ పూజించెదానూ॥ శ్రీ॥
నిద్రహారమూనూ నేమూ నెడానూ నీభక్తితోనూ కానియాడెదానూ॥
నీచారిత్రముగూర్చా నీకృతిగానూ దాసుఁడైనానూ దోసిలొగ్గేనూ॥ శ్రీ॥
రామదాసుఁడానూ రమ్మా బ్రోవగనూ నీమాయతోనూ నెర
నమ్మినాను॥ శ్రీరామ॥

గీ॥ భక్తు లెవ్వరైన శ్రీరాము పాదుకాభి
షేకమును జదువ వినిన శ్రీపతెప్పుడు
సిరియు సంపద ఆయు రారోగ్యమిచ్చి
అంత్యమందున ముక్తిచ్చి ఆదరించు॥

## 50 అపుగుకీర్తన

శ్రీరామచంద్రా! నరేంద్రా! నన్నుబ్రోవరమ్మా! సుగుణసాంద్రా! రంగా! నీనామమే క్షేమ మనినమ్మియున్నాను కామితార్థములిమ్ము కౌసల్యా వరపుత్రా!! శ్రీ!! భక్తులరక్షించుదేవా! నాకు గుట్టిగాజూపుము బ్రోవ ఎరుగ యుక్తుల నెరుగాను శక్తుండనుగాను ఆసక్తితోను ఎటి ఆహారించెదా వాసి!! శ్రీ!! మారేడుబాకాలో యుంటి నీకృపతో నమ్మియుంటి రంగ బ్రోచేదవని నేను చాలాభ్రమసియుంటి నీచరిత మేజగమెల్ల చాటూ చుంటి!! శ్రీ!! గట్టిగ నినునమ్మియున్నా పుట్టా రామా దాసుడా దేనన్నా రంగ నిష్టతో దలచితి నీరాక గోరితి పట్టిమాటగాను వరదా! దయ రాదా రక్షించరాదా!! శ్రీరామ!!

## 51 తోడిరాగము—ఏకతాళము

హారతిదే గొనుమా సారసదళనయన మంగళ హారతిదే గొనుమా!! తండ్రియాజ్ఞ గడపుటకు దండకారణ్యవినుండి దండి భక్తులను బ్రోచు పుండరీకాక్షుజయహారతిదే గొనుమా! భరతుండుతానెంతో చాలభక్తుం డనుమ నూహించి పరమాత్మ మీరిచ్చిన పాదుకలకు కర్పూరహారతిదే గొనుమా! దాశరథీనే జేసిన తప్పులున్న మన్నించుము నైవము నీపనుచు మదిదలంచి మ్రొక్కితిని!! మంగ!! మారేడుబాకాపురమున కూరిమితో వెలసియున్న శ్రీరామచంద్ర నీవు చేకొనుమా! జయమంగళ హారతిదే గట్టిగ నినునమ్మియున్న పుట్టా రామన్న తన యిష్టముతో నిచ్చెనన్న వేడుక నెరవేర్చుమన్న హారతిదే గొనుమా!

### గద్య

ఇది శ్రీరామచంద్ర సేవానిరతులగు శ్రీముద్దండిపాలగోత్ర పుట్టావారివంశ పారావార సుధాకరులగు వెంకన్న తనయులలో ద్వితీయుండైన వెంకయ్య వెంకమాంబ గర్భజనితుండు నగు రామన్న ప్రణీతంబైన రామాయణంబులో అయోధ్యాకాండంబు పాదుకాపట్టాభిషేకము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ